Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

క్షేమంగా వెళ్లు

పంపినవారు :
బి. టి. పద్మినిదేవి, తణుకు

గుబ్బి కర్ణాటక వారి

# కాళహస్తి మహాత్మ్యం

లింగమూర్తి.....
రాజకుమార్....
A.V.సుబ్బారావు
పద్మనాభం.....
రామచంద్రశాస్త్రి
కుమారి.......
మాలతి.......
ఋష్యేంద్రమణి..
రాజసులోచన..
మొదలగువారు






# దేవాలయ పరిశుభ్రతకు

ఆచార నియమములతో శుభ్రంగా స్నానం చేయుటకు మనం పరిశుభ్రమైన సబ్బునే వాడ వలెను. గోద్రెజ్ చందనసబ్బులో స్వచ్ఛమైన, మేలయిన మూలికా తైలములు, ఎసెన్సులు వాడబడినవి. ఏ విధమగు జంతు క్రొవ్వు ను కలియలేదు. గోద్రెజ్ చందన సబ్బు స్వచ్ఛ మైన మైసూరు చందన తైలంతో తయారు చేయబడినది.

Godrej Sandal

రిజిష్టర్డు

## గోద్రెజ్ శాండల్

(చందన)

## టాయిలెట్ (ముస్తాబు) సబ్బులు

ఇతర చందన సబ్బులకంటె తక్కువ ఖరీదులో, ఎక్కువ మేలైన సబ్బు.

## వృత్తికల్పనకు తగుపుస్తకములు

దర్జీపని, కత్తిరింపులు రు. 4/– ఫొటోగ్రఫీ రు. 2–8–0. బెంగాలీ మిఠాయిలు చేయుట రు. 3/– రబ్బరుసామగ్రుల తయారీ రు. 3/– బేటరీల తయారీ రు. 3/– కుటీరపరిశ్రమలు రు. 3/– పిప్పరమెంట్లు తయారీ రు. 3/– సబ్బు పరిశ్రమ రు. 3/– అత్తరులు, ఎసెన్సులు రు. 3/- యువకులకు స్వతంత్రజీవనములు రు. 3/– అచ్చు సిరాలు తయారీ రు. 3/– ఎలెక్ట్రో అండ్ రేడియో గైడ్ (2 భాగములు) విద్యుచ్ఛక్తి అగత్యములేని రేడియోను మీకు మీరే నిర్మించుకోండి. ఇంటి వైరింగ్, ఎలెక్ట్రిసిటీని గురించిన సమస్త విషయములు రు. 3/–

వి. పి. పి. చార్జీలు 12 అణాలు అదనం.

జాబులు ఇంగ్లీషులోనే వ్రాయవలెను

TECHNICAL PUBLICATIONS

(No. 13) ALIGARH (U. P.) India.

## 100 సం. క్యాలండరు

### ఒక అణా

సంవత్సరము, నెల, వారము, తేదీలతో 1951 సంవత్సరము మొదలు 2050 సం. వరకు $13\frac{1}{4} \times 16\frac{1}{2}$ సైజు (ఒకే టావు ఒకే ప్రక్క) తెలుగు, ఇంగ్లీషు మేటరులలో తెల్ల కాగితముపై ప్రింటు అయినది. ఖరీదు రు. 0-1-0 ; వలయువారు (ఖరీదు) అణా రివిన్యూస్టాంపు జత పరచి, మీ అడ్రసుతో స్టాంపున్న కవరు పంపిన క్యాలండరు పంపబడును. వివరములు కోరిన, రిప్లైకార్డు వ్రాయవచ్చును–

టి. వి. సీతారామయ్య

తాడికొండ :: గుంటూరుజిల్లా

PHONE: 31 GRAMS: PUBLISHERS




## మీడియమ్ డిక్షనరీ

## Balasaraswathi Pictorial Medium Dictionary

**ENGLISH - ENGLISH : TELUGU**

with English Synonyms, Antonyms, Definition sand Illustrations together with an Encyclopedia for Students

విద్యార్థులారా!

మా డిక్షనరీ విద్యార్థులకు-విజ్ఞానవేత్తలకు నిత్యం వారు చేసే విద్యా వ్యాసంగంలో ఎంతో ఉపయోగపడుతోంది. వేనకువేలు దీనివల్ల నేడు లాభపడుతున్నారు. విజ్ఞానం కావాలని, ఆంగ్లభాషలో పరిశ్రమ చేయాలని అనుకొనేవారందరికి చేదోడు వాదోడుగా వుండి, మీకా భాషలో శక్తిసామర్థ్యాలు తక్కువగావున్న లోపాన్ని తీర్చగలదు. ఇందులో మీకు అవసరమైనట్టి పదాలన్నింటిని కూర్చి సరిక్రొత్త పద్ధతిలో (English to English and Telugu and English synonyms, Antonyms, Definitions, and Illustrations together with an Encyclopedia for students) చేర్చి అందము చందము లొలికేట్లుగా ముద్రించినాము. విద్యకు - విజ్ఞానానికి పరీక్షలో విజయానికి మీకు ఈ డిక్షనరీ ఎంతైనా తోడ్పడగలదని హామీ ఇస్తున్నాము. పూర్తి క్యాలికోబైండు మీడియం డిక్షనరీ ధర రు. 9-0-0. జెం డిక్షనరీ ధర రు. 4-8-0. తక్కువ వెల! ఎక్కువ విలువ!! అవకాశాన్ని జారవిడుచుకోకుండా జాగ్రత్తపడాలని మిమ్మల్ని ప్రత్యేకంగా కోరుతున్నాము.

బాలసరస్వతీ బుక్ డిపో, పోస్టు బాక్సు నెం. 3 కర్నూలు & మద్రాసు 1.

హిగ్గిన్‌బాథమ్స్ రైల్వే బుక్ స్టాలులలో దొరుకును.

---

'మైసూర్ పేపర్ స్టాకిస్టులు'

# పి. వి. రావు అండ్ బ్రదర్స్,

అన్ని రకముల కాగితముల వ్యాపారులు, ఉత్పత్తిదారుల ప్రతినిధులు

6 ఎ, వారెన్‌రోడ్, మైలాపూరు, మదరాసు-4

దీపావళీ శుభసమయాన

## చందమామ పాఠకులను

హృదయపూర్వకముగ అభినందిస్తున్నారు.



తంతి : VIOLETS




హమాం నాకు అంత యిష్టమైనది ఎందుకంటె—


అది నాకు ఎంతో ఉత్సాహము నిచ్చును!


HAMAM
TOILET SOAP
(దాని పొదుపునకు కూడ మీరు యిష్టపడతారు...
ఎందుకంటె ప్రతి బిళ్ల ఎంతో కాలము వచ్చును!)
A TATA PRODUCT
అది మంచి సబ్బు అని మీకు నిశ్చయముగ తెలుసు. ఎందుకంటె అది టాటా తయారు
ఇండియా పెట్టుబడితో, ఇండియా నిర్వహణ క్రింద,
ఇండియాలోనే తయారవుతున్నది.
శ్రీ.ఎ. ఎఫ్ ఎస్. తలియార్‌ఖాన్ గారి టాటా స్పోర్ట్స్ రెవ్యూ ప్రతి మంగళవారము,
లక్ష్మివారము, శనివారముల రాత్రి 9 గంటలకు రేడియో సిలోన్‌లో వినండి
TS. 9771

*New* **packing**
**For the Famous**
# Kashmir Snow

## కాశ్మీర్ స్నో

ఇప్పుడు మీకు ఆకర్షణీయమైన రంగురంగుల డిజైన్‌లో కొత్తరకం పెట్టెలోను, స్వచ్ఛతను నవ్యతను కాపాడునట్టి టెంపర్ - ప్రూఫ్ అలుకాప్యూల్ సీలుబుడ్డిలోను అందించబడుతున్నది. మీ చర్మమునకు మొఖమల్ వంటి నునుపును, స్వచ్ఛతను, పరిమళమును ఇచ్చి, మీ వదనమును 'సరికొత్త'గా కన్పింపజేసే ఆదర్శప్రాయమైన అందాల క్రీము ఇది.




**NATIONAL TRADING CO.,**

391, MINT ST., :: MADRAS-1

పాపాయిని

చిరు

నవ్వుతో

ఉండనీ



పాపాయి చిరచిరలాడితే రుచికరమైన ఈ "నరిషింగ్ బిస్కత్తులు" ఇవ్వండి. ఎప్పటిలా చిరునవ్వు నవ్వుతూ ఉంటాడు.

జె. బి. మంఘారామ్‌వారి

నరిషింగ్ బిస్కత్తులు

విటమిన్లతో

నిండియున్నవి.




**J. B. MANGHARAM & CO.**
GWALIOR

బ్రాంచి: 35 / 37 తంబుచెట్టి స్ట్రీట్, జి. టి. మద్రాసు.

మా అభిమాను లందరకు హృదయపూర్వకమైన

# దీపావళీ

శుభాకాంక్షలను అందజేస్తూ,

# మల్టీకలర్

ఫొటో ఆఫ్‌సెట్ ప్రింటింగ్, ప్రోసెస్ బ్లాక్ తయారీలలో

అత్యున్నత స్థానాన్ని నిలబెట్టడమే ఎల్లప్పుడు
మా ముఖ్యాశయమని నమ్మకముగ చెబుతున్నాము



మన భారతదేశమందలి ఏ సంస్థయు ఇంతవరకు ఎరుగని 30 అం. × 40 అంగుళముల బ్రహ్మాండమైన కెమెరాను, సరికొత్త ఆధునిక యంత్ర పరికరాలను నెలకొల్పి వున్నాము. నిపుణులు, అనుభవజ్ఞులు ఐన మా టెక్నిషియనులు, ఆర్టిస్టులు

మీ చిత్రములకు అచ్చు సరియైన
పోష్టర్లు తయారు చేయగలరు

---

# ప్రసాద్ ప్రోసెస్

చందమామ బిల్డింగ్స్, మదరాసు - 26

# ఈ విజయ దీపావళి

శుభ సమయాన

మా పాఠకులకు

ఏజంట్లకు

ప్రకటన కర్తలకు

ప్రకటన సలహాదారులకు

సమస్త సౌఖ్యములు కోరుతూ

అభివందనము అర్పిస్తున్నాము.



## చందమామ పబ్లికేషన్స్

మదరాసు - 26.



విజయా
వారి
మిస్సమ్మ
సావిత్రి..యన్.టి.రామారావు..ఏ.నాగేశ్వరరావు
రంగారావు...రేలంగి... రమణారెడ్డి... బాలకృష్ణ.
రామలింగయ్య. దొరస్వామి. జమున ఋష్యేంద్రమణి
డైరెక్షన్...ప్రసాద్
నిర్మాతలు... నాగిరెడ్డి & చక్రపాణి



## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవిగాక - రంగులబొమ్మ కథ, చిత్రకథ, చందమామ
గురించి ... మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

మన "చందమామ" పుట్టి ఇప్పటికి ఏడు దీపావళి పండగలు చేసుకొన్నది. ఈ జయ దీపావళి "చందమామ"కు విశేషాలతో కూడుకొన్న విజయ దీపావళి అని చెప్పవచ్చు. ఏమంటే: ఇప్పుడు ఏడు భాషలలో వెలువడుతున్న "చందమామ", ఏడు భాషలలోనూ ప్రత్యేక సంచికలను ప్రకటించి, యావద్భారత దేశానికీ తన దీపావళి అభినందనాలను అందజేయకలిగింది. అంతే కాదు. పాఠకులూ, అభిమానులూ ఎన్నాళ్లనుంచో విన కుతూహలపడుతున్న "చందమామ" ఆత్మకథను ఈ ప్రత్యేక సంచికల ద్వారా వినిపించగలిగింది. మీరు రచనలను పంపినది మొదలు, పత్రికను మేము తయారుచేసి రవాణా చేయడం—కలకల్లాడే ఆ "చందమామ"ను మీరు అందుకొని ఆహ్లాదంతో చదువుకోపడం వరకూ జరిగే అన్ని దశలనూ, పరిణామాలనూ కన్నులకు కట్టినట్టు చూపించటమే ఈ కథలోని ప్రత్యేకత.

సంపుటి 15 : నవంబర్ 1954 : సంచిక 5





జగత్ పిక్చర్స్‌వారి

## పహలీ ఝలక్

(హిందీ)

నటీనటవర్గం :

వైజయంతీమాల, కిషోర్,
ప్రాణ్, ఓంప్రకాష్

దర్శకుడు : ఎం. వి. రామన్

మ్యూజిక్ : సి. రామచంద్ర

మ్యూజికల్ పిక్చర్స్‌వారి

## యాస్మిన్

(హిందీ)

నటీనటవర్గం :

వైజయంతీమాల, సురేష్
మొదలగువారు

దర్శకుడు : ఎ. ఆర్. కర్దార్

మ్యూజిక్ : సి. రామచంద్ర

దక్షిణభారత మంతటా త్వరలో విడుదల కానున్నవి

---

## మా రాబోవు గొప్ప చిత్రములు

**తమిళం :**

విజయావారి :

### మిస్సియమ్మ
&
### శశిరేఖా పరిణయం

బి. ఎ. ఎస్. ప్రొడక్షన్స్‌వారి :

### రాజు - పేదా

పూర్తిగా తమిళనాడుకు

---

**తెలుగు :** శ్రీ పి. పుల్లయ్యగారి రాబోవుచిత్రం ప్రధానపాత్రలు: సావిత్రి, నాగేశ్వరరావు. (ఆంధ్ర, సీడెడ్, నైజామ్‌లకు.)
ఎ. వి. ఎమ్. వారి **వదిన** —నైజామ్‌కు.

---

**హిందీ :** బారాతీ * కవి * డాకూ-కి-లడ్కి * మెహబూబా
బాప్‌రే బాప్ * దుర్గాపూజ * అప్సరా మొదలైనవి.

: బుకింగ్ వివరాలకు :

## రాజశ్రీ పిక్చర్స్ లిమిటెడ్

మదరాసు, మధురె, ఎర్నాకులం, విజయవాడ, గుంతకల్,
బెంగళూర్ & సికింద్రాబాద్.

# వర్తకుడూ—దర్జీ

దినదినమూ దీపావళి
క్షణక్షణమూ దసరాగా
దర్జాగా జీవించును
దర్జీ ఒకడా వూళ్ళో...

సింగర్ మిషనే శ్రుతిగా
సంగీతము పాడుకొనుచు
ఈలలతో ఏలలతో
రేలుబవలు పనిసేయును.





వాని పొరుగు వణిజు డొకడు
ధనము దెచ్చి దాచుకొనుచు
జాగరణం రాత్రంతా
పగలంతా వ్యాపారం.

ఏ నిముసమొ విశ్రాంతికి
కునుకుదమని కనుమూసిన
మన దర్జీ సంగీతము
తన నిదురను చెడగొట్టగ

అన్నవస్త్రములవలెనే
కొనెవను నిద్రనుకూడా
ధనవంతుడ నాకేమని
గొనకొని దర్జీని పిలిచి







జగమంతా దొంగలనే
బెగడు పుట్టి దర్జీకిక
పాట లేదు పాటు లేదు
శ్రేష్ఠి కితని చిక్కలేదు.

కాని స్వల్ప కాలమునకె
తన పతనము తెలిసిరాగ
ధనపిశాచి నెత్తుకొని
వణిజుకడకు చని దర్జీ

'నీ పైకము నీవే గొని
నా పాటలు నా సుఖమును
మళ్ళీ నా కిచ్చెయ్' మని
నిలువదీసి అడిగెనట!

'నిరుపేదవు నీ యోగ్యత
నెరుగుదు నా మాట వినుము
సిరి గలిగిన నా ధర్మము
ఇరుగుపొరుగు నరయుటె' యని

సుఖముగ నీతరము గడచు
గైకొమ్మని రెండువేలు
స్వర్ణములను కట్టియిచ్చి
పని వినుమన ఆ దర్జీ

ఛంగున తన యిల్లు జేరి
బంగారము పాతిపెట్టె
డబ్బుతోనె సంక్రమించు
జబ్బు లతని పట్టుకొనగ.








# దూకుతా! దూకుతా!

హరిహరపురం అనే ఊరిలో 'అయ్యప్ప' దేవాలయం ఉండేది. అయ్యప్ప దేవుడు చాలా మహిమ కలవాడని ప్రతీతి. ఏ కారణంవల్లనో, కొంతకాలానికి ఆ దేవుడికి పూజాపునస్కారాలు లేకుండా పోవటంచేత గుడి పాడుపడి, క్రమంగా శిథిలమై పోయింది. అక్కడ గుడి కట్టిన ఆవరణ, దేవుడి తోట, అంతా కలిసి ఒక ఎకరం నేల వ్యర్థంగా ఉంటూవుంది.

ఆ నేల దేవుడి సొత్తు కావడంవల్ల, తొక్కి చూడటానికే ప్రజలు జంకేవాళ్ళు. కాని, ఆ స్థలంమీద ఆ ఊరి మునసబు బంగారయ్య కన్ను పడింది.

బంగారయ్య చాలా పలుకుబడికలవాడు. బోలెడంత అంగబలం, అర్థబలం ఉన్నది. ఆయనను ఎదిరించగలవాళ్ళు ఊరిలో కాదుకదా, చుట్టుపక్కలకూడా లేరు. ఈ ధీమాతో బంగారయ్య మెల్లిగా ఆ స్థలం ఆక్రమించి, క్రమంగా ఒక భవనం కట్టించాడు. ఒక ఏకాదశి రోజున అతి వైభవంగా గృహప్రవేశం జరిగింది.

ఆరోజున విందులు, వేడుకలు మొదలైన సందడులవల్ల ఇంట్లో అందరూ తొందరగానే నిద్రపోయారు. కాని, బంగారయ్యకు మాత్రం కునుకు పట్టలేదు. పైగా, అర్థరాత్రి సమయాన 'దూకుతా! దూకుతా!!' అనే శబ్దం ఒకటి ఇంటిపైనుండి వినబడింది.

బంగారయ్య హడలిపోయి. 'వద్దు బాబూ, వద్దు!!' అని అరుస్తూ మంచంమీంచి లేచాడు. ఇదేదో గృహదేవత పలుకుతున్నదనీ, ఇల్లు కూలిపోతుందేమోననీ అతను భయపడ్డాడు. క్షణమైనా అక్కడ నిలవక, అందరనూ లేపి, పిట్టకైనా తెలియకుండా, మళ్ళీ తన పాత ఇంటికి చేరుకొన్నాడు.

'ఇదంతా అయ్యప్పదేవుడి మహిమ. దేవుడి సొత్తు కాజేదామంటే మరి ఏమవు

కుమారి సుగుణ





తుంది ? మునసబుకి తగినశాస్తి జరిగింది' అని అనుకోసాగారు లోకులు. బంగారయ్య, పాపం కష్టపడి కొత్త భవనం కట్టించుకున్నాడేగాని, మరెన్నడూ ఆ దిక్కుకే పోలేదు. అందుచేత, అయ్యప్ప గుడిలాగే బంగారయ్య భవనంకూడా మూత పడింది. నెలలూ, సంవత్సరాలూ గడచిపోతున్నయి.

ఇలా ఉండగా—

ఆ ఊరికి ఒక పేదవాడు, పని దొరుకుతుందేమోనని పొట్ట చేతపట్టుకొని వచ్చాడు. తిండిమాట దేవుడెరుగును, అసలు వాడికి తల దాచుకోవటానికే తావు లేకపోయింది. ఎవళ్ళనడిగినా, బంగారయ్యగారి కొత్త భవనం మాట చెప్పి, 'ఆయన్ని అడిగి ఆ ఇంట్లో వుండరాదా ? ఊరికే వున్నందువల్ల ఆయనకు ఒరిగిందేమిటి ?'' అంటూ వచ్చారు.

ఏమైనాకానీ అని చొరవచేసి ఆ పేదవాడు బంగారయ్యవద్దకు వెళ్ళి అడిగాడు.

ఇంట్లో ఎవడైనా దీపం పెట్టుకుని ఉంటేనే చాలునని ఆత్రంతో వున్న బంగారయ్య కొంచెం బెట్టు కనబరుస్తూ 'సరే, అబ్బాయ్, ఒక నెలవరకు ఆ ఇంట్లో ఊరికే వుండు. తరువాతమట్టుకు నెలకు నాలుగు వరహాలు చొప్పున అద్దె కట్టాలి సుమా!' అన్నాడు. ఆ ఇంటో తనకు జరిగిన సంగతిమట్టుకు కొంచెమైనా వాడికి తెలియనీయలేదు.

ఇదీ బాగానే వుందనుకుని, పేదవాడు పెళ్ళాం బిడ్డలతోసహా పోయి ఆ భవనంలో ప్రవేశించాడు. ఆ రోజు ఏకాదశి.

తల దాచుకునేందుకు జాగా దొరికింది కాని, తిండిమాట ? భవనంలోని ఒక గదిలో వాడు కుటుంబాన్ని పెట్టాడు. తిండి తిప్పలు లేక వాడి పిల్లలు పెట్టే గోలతో ఆ గది మారుమోగిపోయింది. ఊళ్ళోకి వెళ్ళి ఎంత ప్రయత్నించినా పని దొరకలేదు.

ఇటువంటి పరిస్థితిలో ఆ పేదవాడికి జీవితంమీద విరక్తి కలిగింది. 'నేనూ,



కుటుంబమూ అంతా కలిసి ఒక్కసారిగా చస్తే బాధలన్నీ తీరిపోను!' అని అనుకునేటంత వైరాగ్యం కలిగింది వాడికి.

ఇలాంటి ఆలోచనలతో వాడు కుమిలిపోతూ ఉండగా, అర్ధరాత్రి సమయాన ఇంటిపైనుండి 'దూకుతా! దూకుతా!!' అని ఒకశబ్దం వినిపించింది. ఈ శబ్దం విని వాడు ఎంతమాత్రం భయపడలేదు. ఇది గృహానికి సంబంధించిన ఏ దయ్యమో అయివుంటుందనీ, ఇల్లు కూలిపోయి కిందపడితే తనూ, కుటుంబమూ ఒకేసారి మరణించవచ్చుననీ, మనస్సులో తృప్తిచెందాడు. ఈ తృప్తితో వాడు వెంటనే 'దూకు! దూకు!! పీడ వదులుతుంది!!!' అని కేకవేశాడు.

వెంటనే ఇంటివాళ్ళందరకూ ఆశ్చర్యం కలిగేటట్టు, ఒక వరహాల సంచీ పైనుంచి నట్టింట పడింది.

అది కింద పడేటప్పుడు ఒక వాణికూడా ఇలా పలికింది: 'అబ్బాయి!-నీవూ కుటుంబమూ కలిసి నిరాహారంగా ఉండటంవల్ల ఇవాళ మీకు ఏకాదశీ ఫలితం దక్కింది. ఇలాగే ప్రతి ఏకాదశినాడూ ఉపవాసంచేస్తే అయ్యప్పదేవుని మహిమవల్ల మీకు మంచి ఫలితం కలుగుతుంది.' పేదవాడూ, కుటుంబమూ దేవుడికి దణ్ణాలుపెట్టారు. తమ



అదృష్టానికి పొంగిపోయారు. సంచిలో వున్న నూరు వరహాలూ తీసుకొని సుఖంగా కాల క్షేపం చేస్తూవచ్చారు. ప్రతి ఏకాదశి రోజునా నూరేసి వరహాలు వున్న సంచీ పైనుంచి పడుతుండటంవల్ల అతడు ఐశ్వర్యవంతుడయాడు.

ఒకరోజున బంగారయ్యకు ఈ పేదవాడి సంగతి కనుక్కొందామని బుద్ధిపుట్టింది. అక్కడికి వెళ్లాడు. తనకు భవనమిచ్చిన బంగారయ్యను పేదవాడు అనేకవిధాల సత్కరించి, ఆతిథ్యమిచ్చాడు.

అంతలోనే ఐశ్వర్యవంతుడైన పేదవాడి స్థితి చూచి ఆశ్చర్యం కలిగింది బంగారయ్యకు. ఇదంతా ఎలావచ్చిందో చెప్పమని కూర్చున్నాడు. పేదవాడు మాయా మర్మం లేకుండా తను భవనంలో ప్రవేశించిన నాటినుంచి జరిగినదంతా వెల్లడించాడు.

ఈ సంగతి తెలియగానే బంగారయ్యకు అసూయ కలగటమేగాక, దుర్బుద్ధికూడా పుట్టింది. 'అబ్బాయీ!—నీవు ప్రవేశించిన రోజునుంచీ నాకు అద్దె చెల్లించవలసిందే! అదీగాక, ఈ ఐశ్వర్యం నా భవనంలో లభించిందికనుక నాకే చెందుతుంది. ఈ సంగతి ఎవరికైనా చెప్పావంటే జాగర్త!'— అంటూ వాడిని బెదిరించి, నెలాఖరున



భవనం కాళీచేయమని ఆజ్ఞాపించాడు. చేసేదేమీ లేక దిగాలుపడి పేదవాడు భవనం కాళీచేసి పోయాడు.

ఈసారి ధైర్యంతో బంగారయ్యా మళ్లీ వచ్చి, తన కొత్త భవనంలో ప్రవేశించాడు. మళ్లీ ఏకాదశిపర్వం వచ్చింది. ఆనాడు అతడు రాత్రల్లా జాగరణం వుండి, కుటుంబ సహితంగా భక్తి కీర్తనలు పాడసాగాడు.

అర్ధరాత్రప్పుడు 'దూకుతా! దూకుతా!!' అని ధ్వని ఇంటి పైనుండి వినిపించింది. వెంటనే బంగారయ్యా గంపెడాశతో 'దూకూ! దూకూ!!—నీకోసమే కనిపెట్టుకున్నాం!!!' అన్నాడు. భార్యకూడా అతనితోపాటు

అలాగే కేకలుపెట్టింది. వరహాలమూట పడీ పడటంతో ఏరుకోవచ్చుకదా అని వాళ్ళు తయారుగా ఉన్నారు.

అంతలో పైనుండి ఒక మూట నట్టింట పడింది. ఇద్దరూ పోయిచూస్తే, అందులో వరహాలు లేవుకదా, భయంకరమైన ఒక వంద తేళ్ళు బిలబిలమంటూ నలుమూలలకూ ప్రాకసాగినై. హడిలిపోయి వాళ్ళు దూరంగా పారిపోయారు.

అప్పుడు ఆకాశవాణి చెప్పినట్టుగా ఈ మాటలు వినబడినై: 'ఓయి దుష్టుడా!— ధనాశవల్ల నీవు ఎంతటి పనికైనా తలపడతావు. కనుక, నీకు కలిగే ఏకాదశి ఫలం ఇదే. ఇంతే కాదు, నువు పేదవాడికి ఇచ్చిన మాట చెల్లించుకొంటివా బాగుపడతావు. లేకుంటే, ఈసారి తేళ్లేకాదు, పాములుకూడా రాలుతై. ఇది అయ్యప్ప మహిమ! మనిషి గుణాన్నిబట్టి ఫలితం ఉంటుంది. కనుక, జాగ్రత్తగా మసులుకో.'

తక్షణమే బంగారయ్య, తనకు ఈ భవనం అచ్చిరాలేదని తలచి పాత ఇంటికి మరలిపోయాడు. మరునాడు ఉదయానే పేదవాడికి కబురంపి, వాడితో దాపరికం లేకుండా జరిగినదంతా చెప్పివేశాడు. 'భవనం నిర్మించింది నేనే అయినా, నాకు నివాసయోగ్యంకాదు. నువ్వు అన్నివిధాలా అదృష్టవంతుడివి. నాకు అద్దెకింద ఏమీ యివ్వ నవసరంలేదు' అన్నాడు. నాటినించీ మళ్ళీ ఆ బీదవాడినే అద్దెలేకుండా ఆ భవనంలో ఉండమని కోరాడు.

వెంటనే పేదవాడు భవనంలో మళ్ళీ ప్రవేశించి, సుఖంగా ఉంటున్నాడు. వాడు ఆ ఆవరణలోనే అయ్యప్పదేవుడికి చిన్న గుడి స్థాపించి, భక్తితో ఆరాధిస్తూ, ప్రతి ఏకాదశిరోజునా ఉపవాసం ఉంటూ, ఐశ్వర్యంతో కాలం గడిపాడు.






## 11

[చతుర్నేత్రుడూ, సమరసేనుడూ కొండకొనను ఉండగా, ఒక వైపునుంచి ఏకాక్షి వచ్చి—అప్పుడే కొండ ఎక్కి వస్తూన్న కుంభాండుణ్ణి అడ్డగించటం జరిగిందికదా! అదే సమయమని సమరసేనుడు, కుంభాండుణ్ణి ఎదుర్కొన్నాడు. కుంభాండుడి వెంటవున్న ఆటవికులు చాలామంది మరణించారు. నెత్తురువాసన పసిపట్టిన తోడేళ్ళగుంపు వాళ్ళ మీదికి దూకింది. యుద్ధం మాని ప్రాణభయంతో అందరూ పారిపోసాగారు. తరవాత—]

సమరసేనుడూ, సైనికులూ కొంతదూరం పరిగెత్తి ఆగారు. వారున్న చోటుకు కుంభాండుడి అనుచరులైన ఆటవికుల కేకలు వినబడుతున్నవి. వాళ్ళు తమ మాట మరిచి ప్రాణరక్షణకు అడవికేసి పారిపోతున్నారని సమరసేనుడు గ్రహించాడు. చతుర్నేత్రుడూ, ఏకాక్షి ఆ ప్రాంతాల ఎక్కడా ఉన్నట్టులేదు. తోడేళ్లు మాత్రం ఇంకా అరుస్తూనే ఉన్నవి. అవి గాయపడి పారిపోలేకపోయిన ఆటవికుల్ని భక్షిస్తున్నవని తెలుస్తూనేవుంది.

అలసిపోయిన సైనికులతోపాటు సమరసేనుడుకూడా ఒక చెట్టుకింద విశ్రమించాడు. కుంభాండుడుకూడా ఆ ధనంతో వున్న నావను వశపరుచుకోవాలని గట్టి ప్రయత్నం ప్రారంభించాడని సమరసేనుడికి అర్థమైంది. ఇక ఇప్పుడు దాని కోసం ఆరాటపడేవాళ్ళు నలుగురయ్యా



రన్నమాట. తనూ, కుంభాండుడూ, ఏకాక్షీ, చతుర్నేత్రుడూ! ఐతే ఈ ప్రయత్నంలో విజయం ఎవరికి లభ్యమయేటట్టు?

సమరసేనుడు ఇలాంటి ఆలోచనలతో ఉండగా సైనికులు తమ ద్వీపానికి ఎప్పుడు తరలిపోదామా అన్న ఆతృతలో ఉన్నారు. వారికి ఆ ధనంమీద ఏమాత్రం ఆశ లేక పోగా, అదే ఇన్ని ప్రమాదాలకు కారణం అయిందన్న కోపంతో ఉన్నారు.

"సేనానీ, మనం ఈ ద్వీపాన్ని వదలి పోవటం మంచిది. మీరు తగు ప్రయత్నాలు చేయండి," అన్నాడు ఒక సైనికుడు. మా అందరి కోరికా అదేనన్నట్టుగా మిగతా



సైనికులందరూ తలలు ఊపారు. అప్పుడు సమరసేనుడు సైనికులకేసి ఒకమారు చూసి తలపంకించి, "ఈ ద్వీపాన్ని వదలి పోవటం క్షేమమని ఎప్పుడో నిర్ణయించు కున్నాం. ఆ మాట పదేపదే అనుకున్నందు వల్ల ప్రయోజనం ఏమీ లేదు. అసలు సంగతి ఈ ద్వీపాన్ని వదిలేందుకు ఉపాయం ఏమిటా అన్నదే!" అన్నాడు.

ఆ ఉపాయం ఏమిటో సైనికులకూ తెలియదు. తమ రాజ్యం వెళ్ళిపోవాలనే ఆరాటంతప్ప వెళ్ళేందుకు మార్గం ఒక్కరికీ తెలియదు. తీరంలో ఉంచివచ్చిన ఓడలు ఏ స్థితిలో ఉన్నవో వారెరగరు. పైగా ఏకాక్షినుంచీ, కుంభాండుడినుంచీ ఏ ప్రమాదమూ కలగకుండా చూచుకోవాలి. వారి కంటబడకుండా తప్పించుకుపోవాలి. ఇది అంత తేలికయిన పనికాదని అంద రికీ భయంగానే వుంది.

"మనం ఇక్కడినుంచి తప్పించుకు పోయేందుకు చతుర్నేత్రుడు సాయపడ లేడా?" అని ఒక సైనికుడు ప్రశ్నించాడు. అందుకు సమరసేనుడికి ఏమని జవాబు చెప్పాలో తెలిసిందికాదు. తమను ఈ భయంకర ద్వీపంనుంచి, తమ కుండలినీ ద్వీపం చేర్చమని అతనెన్నడూ చతుర్నే

త్రుణ్ణి అర్థింపలేదు. ఇలాంటిది చతుర్నేత్రుడికైనా సాధ్యమా అన్న అనుమానం కూడా అతడికి ఉంది.

అందరూ ఇలాంటి అలోచనల్లో వుండగా ఎక్కడినించో రివ్వుమని ఒక బాణం వచ్చి సమరసేనుడు అనుకు కూర్చున్న చెట్టుకు తాకింది. అది సరిగా సమరసేనుడి తలకు ఒక అడుగు ఎత్తులో చెట్టు బోదెకు గుచ్చుకుపోయింది. మరుక్షణంలోనే సమరసేనుడు గంతువేసి లేస్తూ—"చెట్ల చాటుకు తప్పుకోండి! కుంభాండుడు ఎక్కడో పొంచివుండి మనను హతమార్చాలని చూస్తున్నాడు" అంటూ పరిగెత్తసాగాడు. సైనికులుకూడా అతణ్ణి అనుసరించారు. మరుక్షణంలోనే "పట్టుకోండి, చంపండి!" అన్న కుంభాండుడి కేకలు వినిపించాయి. అటవికులు అడవి దద్దరిల్లేలా అరుస్తూ చెట్లమాటునుంచి బయటికి రాసాగారు.

సమరసేనుడు తను చాలా ప్రమాదంలో చిక్కుకున్నానని గ్రహించాడు. తన వెంట వున్న ఐదుగురు సైనికులతో అన్నివైపుల నుంచీ చుట్టుముట్టుతూవున్న ఆటవికుల్ని ఎదుర్కోవటం క్షేమంకాదు, ప్రస్తుతానికి పారిపోవటమే ఉత్తమం అని నిర్ణయించుకున్నాడు. దారీ తెన్నూ లేని ఆ చెట్లల్లోంచి






ఆటవికులూ యింకా తమను వెంబడిస్తున్నట్టు, వాళ్ళ కేకలనుబట్టి గ్రహించారు. ఇంకా మరి కొంత దూరం పరిగెత్తడం కన్న, దాపులనున్న ఏ చీకటి గుహలోనో ప్రవేశించి, ఆ రాత్రికి అక్కడ కాలం గడపడం మంచిదనిపించింది, సమరసేనుడికి.

ఎదురుగా కనబడుతున్న గుహ కేసి సమరసేనుడు పరీక్షగా చూస్తున్నంతలో, సైనికులు తమ నాయకుడి ఆలోచన గ్రహించి, అటు కేసి నాలుగైదడుగులు వేశారు. వెంటనే సమరసేనుడు వాళ్లను, "తొందరపడకండి, కొంచెం ఆగండి!" అంటూ హెచ్చరించాడు.

"తొందరపడి గుహలో ప్రవేశించడం ప్రమాదకారణం కావచ్చు. ఆ గుహలో సింహం లాంటి ఏ క్రూరమృగమో వుండవచ్చు గదా!" అన్నాడు సమరసేనుడు.

"సేనానీ, మరేం చేయాలి? కుంభాండుడు, ఆటవికులతో మన వెన్నంటి వస్తున్నాడు గదా?" అన్నాడొక సైనికుడు, వెనుదిరిగి చూస్తూ.

"గుహలో సింహం వున్నదీ లేనిదీ తెలుసుకోవడం ఎలా? మరొక గుహ దగ్గిరకుపోయినా, యిదే సమస్య ఎదురౌతుంది గదా?" అన్నాడు మరొక సైనికుడు.

సైనికుల ప్రశ్నలకు సమరసేనుడు చిరునవ్వు నవ్వాడు. తాను ముందుగా హెచ్చరించకపోతే వాళ్ళు గుహలోకి జొరబడడం జరిగి వుండేది. ఒకవేళ ఏ సింహమో, పులో అక్కడ వుంటే, వాళ్ళు దానికి ఎర అయిపోయి వుండేవాళ్ళు.

సమరసేనుడు విల్లంబులు చేతికి తీసుకుని, "మీరందరూ కత్తులతో సిద్ధంగా వుండండి. నేను గుహలోకి బాణం కొడతాను. ఒకవేళ లోపల ఏదైనా కౄరమృగం వుంటే, అది హఠాత్తుగా మన మీదికి వచ్చిపడుతుంది. జాగ్రత్త!" అన్నాడు.

సైనికులను యిలా హెచ్చరించి సమరసేనుడు గుహలోకి బాణం వదిలాడు.





అవక తప్పదు. ఈ సంగతి బాగా అలోచించి, "మీలో యిద్దరు కత్తులతో సిద్ధంగా వుండండి. నేను గుహలోకి బాణం కొట్టి సింహం వున్నదీ లేనిదీ పరీక్షిస్తాను. ఒకవేళ వుంటే అది అరుస్తూ మనమీదికి వురుకుతుంది. జాగ్రత్త!" అని హెచ్చరించాడు సమరసేనుడు.

తరవాత బాణం ఎక్కుపెట్టి గుహలోకి వదిలాడు. మరుక్షణంలోనే సమరసేనుడు వూహించినది సత్యమని రుజువయింది. భయంకరంగా గర్జిస్తూ ఒక సింహం గుహ బయటికి దూకింది. కత్తులతో సిద్ధంగావున్న సైనికులు దానిమీదికి లంఘించారు. కాని ఆ సింహం అంతలో వెనుకకు తగ్గి అడవిలోకి పారిపోయింది.

సమరసేనుడు కత్తి చేబట్టి ముందుకు నడవసాగాడు. వెనుకనే సైనికులుకూడా కత్తులు సిద్ధంగా వుంచుకుని అనుసరించారు. వాళ్ళు గుహదగ్గరకు వెళ్ళి లోపల అడుగుపెట్టేసరికి సన్నని అరుపులాంటిది వినిపించింది. వెంటనే సమరసేనుడు నాలుగైదడుగులు వెనుకకు తగ్గి—

"గుహలో, గాయపడిన మరో సింహం వున్నట్టుంది. అది ఏ స్థితిలో వున్నదో తెలుసుకోకుండా లోపలికి వెళ్ళటం ప్రమాదకరం. నిప్పు వెలిగించండి," అన్నాడు సైనికులతో. వెంటనే ఇద్దరు సైనికులు చెకుముకిరాయి కొట్టి గుహద్వారందగ్గిర చిన్న మంట చేశారు. దానితో చిన్న కాగడా ముట్టించి సమరసేనుడు ముందుకువెళ్ళి గుహ లోపలిభాగాన్ని పరీక్షగా చూశాడు. అక్కడ బాణందెబ్బ తిని గిలగిల తన్నుకుంటున్న ఒక సింహంపిల్లా, దానిపక్కనే అరుస్తూ మరో సింహంపిల్లా కనిపించినై.

"భయంలేదు, యిక లోపలకు రండి" అంటూ సమరసేనుడు గుహలోకి వెళ్లాడు. గాయపడకుండావున్న సింహంపిల్ల గర్జిస్తూ మెల్లిగా వెనకడుగు వేయసాగింది. సమర



సేనుడు దానికేసి ధైర్యంగా నడుస్తూ, మెల్లగా యీలవేయసాగాడు. కొద్దిసేపట్లోనే అది గర్జించటం మాని గుహలో ఒక మూల వత్తిగిలి కూర్చున్నది. సైనికులూ, సమరసేనుడుకూడా లోపల కూర్చున్నారు.

అప్పటికి బాగా ప్రొద్దుపోయింది. కుంభాండుడూ, ఆటవికులూ ఇంకా సమరసేనుడికోసం అడవి గాలిస్తున్నారనటానికి సూచనగా అప్పుడప్పుడూ వాళ్ల కేకలు వినబడుతున్నాయి. తాము వున్న చోటు తెలియరాకుండా ఉండేందుకు సమరసేనుడు గుహముందు వెలిగించిన మంట ఆర్పి వేయించాడు.




గుహలో చాలా చీకటిగా వుంది. బాణం దెబ్బ తిన్న సింహంపిల్ల చచ్చిపోయింది. గుహమూలకు పోయి కూర్చున్న సింహంపిల్లమాత్రం, అక్కడే ఉండి కవ్విస్తున్నట్లు మధ్య మధ్య మెల్లిగా గర్జిస్తోంది. బయటికి పారిపోయిన సింహం తన పిల్లలకోసం తిరుగా వస్తుందన్న భయం సమరసేనుడికి కలిగింది. అంతేకాక కుంభాండుడూ, ఆటవికులూ తమకోసం ఆ ప్రాంతం అంతా గాలిస్తున్నారనికూడా గ్రహించాడు.

సమరసేనుడుగానీ, సైనికులుగానీ కళ్లు మూయటానికి కూడా భయపడుతున్నారు. వస్తూన్న నిద్రను ఆపుకొంటూ వారు అలాగే కూర్చున్నారు. హఠాత్తుగా కుంభాండుడు తన ఆటవిక మూకతో గుహ ద్వారాన్ని అటకాయిస్తే తమకు ప్రాణాపాయం తప్పదని సమరసేనుడి భయం. అందుకని సైనికులను ఆ ప్రాంతంలో వున్న చెట్లమీద వేగులుగా వుంచటం మంచిదనుకున్నాడు.

"మనం అందరం ఇక్కడే కూర్చోవటంవల్ల ప్రయోజనం లేకపోగా ప్రమాదం కూడావుంది. మీరు ఆ కనబడే చెట్లెక్కి కుంభాండుడి చర్యలను కనిపెట్టిచూడండి" అని అతడు సైనికులను ఆజ్ఞాపించాడు. సైనికులు తమ తమ ఆయుధాలు చేతబట్టి

గుహ బయటికి వచ్చారు. అక్కడకు కొంచెం దూరంలో గుబురు కొమ్మలతో ఉన్న చెట్టెక్కి కుంభాండుడు ఎక్కడ ఉన్నదీ పరీక్షగా చూడసాగారు.

గుహలో ఒంటరిగా వున్న సమరసేనుడికి దగ్గర్లోనే మాటలు వినబడినై. అవి తన సైనికుల మాటలు కావని గుర్తించాడు. ఒకవేళ కుంభాండుడి ముఠా ఏమో అన్న అనుమానం కలిగింది. మెల్లగా గుహద్వారం వరకు వచ్చి బయటికి తొంగి చూశాడు. ఎవరూ లేరు. తిరిగి గుహలోకి వెళ్ళాడు. ఈసారి మాటలు స్పష్టంగా వినబడుతున్నవి.

అతడికి చాలా ఆశ్చర్యం కలిగింది. గుహలోనుంచి ఎటువైపుకైనా రహస్య ద్వారం ఉందేమో అని పరికించి చూశాడు. గుహ వెనకవైపునుంచి శబ్దం వస్తున్నట్లు తెలిసి ఆశ్చర్యపోయాడు. పెద్ద కొండలో ఉన్న ఈ చిన్ని గుహ వెనకకు మానవ మాత్రులు యెలా వెళ్ళగలిగారా అన్న సంశయం అతడికి కలిగింది. రహస్య ద్వారం ఏదైనా ఉన్నదేమో అని గుహ వెనుకభాగాన్ని పరీక్షించి చూడసాగాడు.

హఠాత్తుగా అతడి చేతికి చిన్న మేకులాటి వస్తువు తగిలింది. దాన్ని పట్టుకుని బలంగా గుంజేసరికి రాతిలో మలచబడిన ఒక చిత్రమైన తలుపు తెరుచుకొన్నది. అందులోనుంచి చంద్రకాంతి గుహలో ప్రవేశించింది. అక్కడికి కొద్దిగజాల దూరంలోనే యిద్దరు మనుషులు మాట్లాడుకుంటున్నట్టు సమరసేనుడు చూచాడు. వాళ్ల దుస్తుల తీరునుబట్టి చూస్తే వాళ్ళు అటవికులుగా లేరు. మంచి మంచి రంగురంగుల దుస్తులు ధరించివున్నారు.

సమరసేనుడు ఏమి చేయటమా అని ఆలోచించేటంతలో వాళ్ల దృష్టి అతడిపై బడింది. వాళ్ళు ఒక్కసారిగా సమరసేనుడి మీదికి దూకి అతణ్ణి బంధించారు.

—(ఇంకా వుంది)






# సంజ్ఞల పండితుడు

పూర్వం కాంచీనగరంలో ఒక పండితుడు ఉండేవాడు. అయనను అందరూ 'సంజ్ఞల పండితుడు' అని పిలిచేవారు. మనుష్యులు తమ అభిప్రాయాలను మాటలతో తెలుపుకునేకంటే, సంజ్ఞలద్వారా తెలియచెప్పకోవటం మంచిదని ఆయన ప్రచారం చేస్తుండేవాడు.

ఒకనాడు ఆ పండితుడు రాజుదగ్గరకు వెళ్ళి యీ సంగతే చెప్పాడు. రాజు లోలోపల నవ్వుకుని "ఈ సంగతి చెప్పేందుకు మీరు నాదగ్గరకు పనికట్టుకు వచ్చారా? నేను చాలాకాలంకిందటే ఒక 'సంజ్ఞలశాస్త్రి 'ని శివగంగపురం పాఠశాలలో నియమించాను" అన్నాడు.

రాజు, హాస్యానికి అన్న యీ మాటల్ని పండితుడు నిజమనుకున్నాడు. "మహారాజా, మీరు చాలా దూరదృష్టి గలవారు. చిన్నతనంలోనే మనుష్యులకు ఈ సంజ్ఞా శాస్త్రం బోధించటంవల్ల చాలా మేలు జరుగుతుంది. నేను ఆ సంజ్ఞలశాస్త్రిగారి దర్శనం చేసుకువస్తాను. సెలవు" అంటూ రాజుకు నమస్కరించి సంజ్ఞలపండితుడు శివగంగపురం బయలుదేరాడు.

సంజ్ఞలపండితుడు అలా బయలుదేరుతాడని రాజు అనుకోలేదు. తీరా పండితుడు శివగంగపురం వెళితే తన మాట అబద్ధం అవుతుందే అనుకున్నాడు రాజు. అందుకని ముందుగానే ఒక సేవకుణ్ణి శివగంగపురం పంపాడు.

వాడు అక్కడికి వెళ్ళి పాఠశాలాధికారులతో, యిలా ఒక సంజ్ఞల పండితుడు వస్తాడనీ, అతణ్ణి ఏదో ఒక మాయోపాయంతో యింటిదారి పట్టేట్టు చూడవలసిందనీ, రాజుగారిమాటగా చెప్పాడు.

జె. పట్నాయక్



అతరవాత ఒకటి రెండు రోజులకు సంజ్ఞలపండితుడు శివగంగపురం చేరాడు. అక్కడి పాఠశాలాధికారులు అతణ్ణి సత్కరించి, "అయ్యా! మా శాస్త్రిగారు దేశాటనం వెళ్ళి నెలరోజులైంది. ఇంతలో తిరిగి రారు" అని చెప్పారు.

"సరే, యింతదూరం వచ్చి ఆయన్ని కలుసుకోకుండా ఎలా తిరిగి వెళ్ళేది? ఆయన దేశాటన ముగించుకు వచ్చేవరకు యిక్కడే వుంటాను" అన్నాడు సంజ్ఞల పండితుడు.

పాఠశాలాధికారులు యీ పండితుడు ఒకపట్టాన వదిలే రకం కాదని తెలుసుకున్నారు. మరునాడు ఒంటికంటివాడైన పాఠశాల సేవకుడొకడికి పండితవేషం వేశారు. వాడికి చెప్పవలసినవన్నీ చెప్పి, "ఆ సంజ్ఞల పండితుడు సంజ్ఞలద్వారా అడిగే ప్రతిదానికీ, నువ్వూ సంజ్ఞలతోనే జవాబివ్వు. ఏ పరిస్థితుల్లోనూ నోరు మెదపకు!" అని హెచ్చరించారు.

తరవాత సంజ్ఞలపండితుడితో, "అయ్యా! మా సంజ్ఞలశాస్త్రిగారు దేశాటన ముగించుకుని వచ్చారు. ఆ గదిలో వున్నారు. తమరు వారిని కలుసుకోవచ్చు" అని చెప్పారు.

సంజ్ఞలపండితుడు సరే అని గదిలోకి వెళ్లాడు. అక్కడ పండితశాలువా తలకు చుట్టుకుని నిండుగా కూర్చున్న ఒంటికంటివాడు కనిపించాడు. సంజ్ఞలపండితుడు అతడికి ఒక వేలు చూపించాడు. అందుకు ఒంటికంటిశాస్త్రి రెండు వేళ్లు చూపించాడు. తిరిగీ పండితుడు మూడువేళ్ళు చూపించాడు. అప్పుడు ఒంటికంటిశాస్త్రి కోపంగా చూసి పిడికిలి బిగించి చూపాడు.

అప్పుడు సంజ్ఞలపండితుడు నవ్వుతూ తనవద్ద వున్న గంగరేగుపండును శాస్త్రికి చూపించాడు. అప్పుడు ఒంటికంటిశాస్త్రి తనదగ్గర వున్న రొట్టెముక్క నొకదానిని

సంజ్ఞలపండితుడికి చూపాడు. అవెంటనే సంజ్ఞలపండితుడు లేచి ఒంటికంటిశాస్త్రికి నమస్కరించి గది బయటికి వచ్చాడు. అక్కడ వేచివున్న పాఠశాలాధికారులు "అయ్యా, మా సంజ్ఞలశాస్త్రిగారినిగురించి మీ అభిప్రాయమేమిటి ?" అని అడిగారు. అందుకు సంజ్ఞలపండితుడు—

"మీ సంజ్ఞలశాస్త్రిగారు చాలా సమర్థుడు. గొప్ప తత్వవేత్తకూడా అని గ్రహించాను. నేను, దేవుడు ఒక్కడే అని చెప్పటానికి ఒక వేలు ఎత్తి చూపగా, కాదు శివకేశవులు యిద్దరు అని రెండు వేళ్ళు ఎత్తి చూపాడు. అట్లా అయితే బ్రహ్మతో కూడా కలిసి త్రిమూర్తులు ముగ్గురుగదా అని చెప్పేందుకు నేను మూడు వేళ్లు చూపించాను. కాని ఆయన గుప్పెట బిగించి ముగ్గురూ ఒకటే అని తెలియపరిచారు.

"అప్పుడు నేను దేవుడు పరమదయాళు డని చెప్పేందుకు ఆయన మానవకోటికి ప్రసాదించిన అత్యంత స్వాదుఫలాల్లో గంగరేగుపండు ఒకటని, నావద్ద వున్న గంగరేగు పండు చూపించాను. కాని తత్వవేత్త అయిన మీ శాస్త్రిగారు తనవద్ద వున్న రొట్టె ముక్కను నాకు చూపి, భోగార్థమయిన గంగరేగుపండ్లకంటె, సర్వజనోపయోగకరములైన రొట్టెముక్కలే శ్రేష్ఠమైనవని నాకు



పరమార్థాన్ని బోధించారు" అని చెప్పి సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు. ఆయన వెళ్లినతరవాత పాఠశాలాధికారులు సంజ్ఞల శాస్త్రి వేషంలో వున్న సేవకుణ్ణి పిలిచి ఏమి జరిగిందని అడిగారు. అందుకు వాడు—

"అయ్యా! ఈ పండితుడు చాలా దుర్మార్గుడులా వున్నాడు. గదిలోకి వస్తూనే నన్ను అధిక్షేపించేందుకు ఒక వేలును పైకెత్తి, నీది ఒంటికన్ను కాదా? అని సంజ్ఞచేశాడు. అందుకు నేను కోపగించుకో కుండా, నీ రెండు కన్నులకంటె నా ఒంటి కన్నే మంచిది అని తెలియపరిచేందుకు రెండు వేళ్ళు చూపించాను. అప్పుడు ఆ పండితుడు నీ ఒంటికన్నూ, నా రెండు కన్నులూ కలిపితే మూడు కన్నులుగదా? అనేందుకు మూడు వేళ్లు చూపించాడు.

"అతడి ప్రవర్తన చూసి నాకు చాలా కోపంవచ్చింది. మరోసారి అలా ఎత్తిపొడిచా వంటే ముక్కుమీద కొడతానని చెప్పేం దుకు నేను పిడికిలి బిగించిచూపాను. ఆ దెబ్బతో ఆ దుర్మార్గుడు హడలిపోయి, నన్ను మంచిచేసుకునేందుకు, తనదగ్గర వున్న గంగరేగుపండును లంచంగా యిస్తా నని నాకు చూపించాడు.

"నేను లంచానికి ఆశపడక నీ రేగుపం డెవడిక్కావాలి, నాదగ్గరవున్న రొట్టెముక్క ముందు అది దిగదుడుపుకదా అని చెప్పేం దుకు, నావద్దవున్న రొట్టెముక్క చూపించాను.

"దానితో ఆ దుర్మార్గుడు యిక లాభం లేదనుకొని, నమస్కరించి బయటికి పారిపోయాడు," అని చెప్పాడు.

పాఠశాలాధికారులు యీ రెండు రకా లైన వ్యాఖ్యానాలూ విని పొట్ట చెక్క లయ్యేలా నవ్వుకున్నారు.

ఈ సంగతి రాజుగారికి తెలియబరచగా, రాజుకూడా చాలా సంతోషించాడు.



# సూక్ష్మదృష్టి

చాలా కాలంకిందట కాశీనగరానికి సమీపంలో ఒక బ్రాహ్మణుడుండేవాడు. అతడికి పన్నెండేళ్ళ కుమారుడుండేవాడు. వాడికి అడుగుజాడలు కనిపెట్టటంలో అపారప్రజ్ఞ ఉండేది. రాళ్ళపై మనుష్యులు నడిచినప్పటికీ వాడు అడుగుజాడలు గుర్తించగలిగేవాడు. వాడికీ శక్తి వుండటం చేత వాణ్ణి అందరూ 'సూక్ష్మదృష్టి' అని పిలిచేవాళ్ళు.

ఉన్న ఊళ్ళో పొట్టగడవక ఆ బ్రాహ్మణుడు తన కొడుకుతోసహా కాలినడకను కాశీనగరం చేరుకున్నాడు. తన కుమారుణ్ణి కొలువుకు తీసుకుపోయి, రాజుతో, "మహారాజా, నా కుమారుడు సూక్ష్మదృష్టి అడుగుజాడలు కనిపెట్టటంలో అత్యద్భుతమైన ప్రజ్ఞ కలవాడు. వాణ్ణి తమ కొలువులో ఉంచుకొన్నట్టయితే తమకు చోరభయం వుండదు," అని విన్నవించుకున్నాడు.

అసలే రాజు ధనలోభి. దానికి తోడు ఆ కాలంలో చోరభయం చాలా జాస్తిగా వుండేది. అందుచేత రాజు సూక్ష్మదృష్టిని తన కొలువులో ఉంచుకుందామని నిశ్చయించుకొని, యేమి జీతం కావాలని అడిగాడు.

"మహారాజా, నా కుమారుడివంటి సూక్ష్మదృష్టి ప్రపంచంలో మరొకడు దొరకడు. అందుచేత వాడికి రోజుకు నూరు వరహాలు జీతం ఇప్పించండి!" అన్నాడు బ్రాహ్మణుడు.

రాజుకిది చాలా పెద్దజీతంగా తోచింది. కాని బ్రాహ్మణుడు తగ్గలేదు. విధిలేక రాజు సూక్ష్మదృష్టిని రోజుకు నూరువరహాల జీతం మీద కొలువులో పెట్టుకొన్నాడు. ఈ వార్త తెలియగానే నగరంలోని గజదొంగలకు కూడా హడలెత్తిపోయింది. వారు రాజభవనంకేసి చూడటంకూడా మానేశారు.

పి. చక్రధరరావు




కొంతకాలం గడిచింది. సూక్ష్మదృష్టి రోజూ కొలువుకు వస్తున్నాడు. ఫలహారాలు పుచ్చుకుంటున్నాడు. ఉద్యానవనంలో చదరంగం ఆడుకుంటున్నాడు. ఇంటికి వెళ్ళేటప్పుడు ఖజానానుంచి మూటముడుపుగా నూరువరహాలూ పట్టుకుపోతున్నాడు. ఎన్ని మాసాలు జరిగినా రాజభవనంలో ఒక్క దొంగతనం లేదు. సూక్ష్మదృష్టి దొంగలను పట్టుకోవటమంటూ అసలే లేదు.

అకస్మాత్తుగా కాశీరాజు కొక సందేహం కలిగింది. 'రోజుకు నూరువరహాలు పుచ్చుకుంటున్న ఈ బ్రాహ్మణ కుర్రవాడికసలు అడుగుజాడలు కనిపెట్టేశక్తి ఉన్నట్టుకూడా రుజువుకాలేదే! వాడి తండ్రిచెప్పిన మాటలు తప్ప మరొక ఆధారమే లేదు. దొంగతనమే జరిగితే వాడు దొంగలను పట్టగలడని అనుకునేటందు కేమి అవకాశం ఉందీ?'

రాజు తన మంత్రితో ఈ విషయమై రహస్యంగా సంప్రతించాడు. ఇద్దరూ కలిసి కుర్రవాణ్ణి పరీక్షకు పెట్ట నిశ్చయించారు. ఆరాత్రి ఖజానాను తామే దొంగిలించారు. బోలెడన్ని నగలూ, డబ్బూ సంచులలో మూటకట్టారు. ఆ సంచులు పట్టుకుని రాజభవనంచుట్టూ మూడుసార్లు ప్రదక్షిణం చేశారు. తరువాత ఉద్యానవనంలోనుంచి రాజప్రాసాదం ప్రహరీగోడ ఎక్కి బయటికి దూకి, అవతలఉన్న బావిలో సంచులు పడేసి, ఎవరిదారిన వారు గృహాలకువెళ్లారు.

తెల్లవారేసరికి ఖజానాలో దొంగతనం జరిగినట్టు పొక్కిపోయింది. మామూలు ప్రకారం కొలువుకు వచ్చిన సూక్ష్మదృష్టితో దొంగలనూ, పోయిన ధనాన్నీ పట్టమని రాజూ, మంత్రీ అడిగారు. సరేనని సూక్ష్మదృష్టి ముందు ఖజానాకు వెళ్ళాడు.

అతని దృష్టికి ఇద్దరు మనుషుల అడుగుజాడలు కనిపించటమే గాక, వారి పాదాల రేఖలుకూడా కనపడ్డాయి. వాటినిబట్టి రాజూ, మంత్రీ కలిసి తనను పరీక్షించటానికి దొంగ

తనం చేశారని అతను తెలుసుకొన్నాడు. అయితే పోయినసొమ్ము పట్టాలి గనుక, సూక్ష్మదృష్టి అడుగుజాడలనుబట్టి పోసాగాడు. అతను కూడా రాజభవనంచుట్టూ మూడుసార్లు తిరిగాడు. తరవాత నేలకేసి చూస్తూ ఉద్యానవనం దాటి, ప్రహరీగోడ దూకి బావివద్దకు వెళ్ళాడు.

"ఎవరైనా ఈ బావిలోకి దిగిచూడండి. ఇందులో పోయిన సొమ్ము దొరకవచ్చు. ఎందుకంటే దొంగలు ఇక్కడినుంచి తిరిగి రాజప్రాసాదంలోకి ప్రవేశించారు!" అన్నాడు సూక్ష్మదృష్టి.

తక్షణమే రాజభటులు బావిలోకిదిగి, పోయిన ధనంమూటలు పైకి తీశారు.

"భేష్! తెలివిగలవాడివే. కాని ధనం మాత్రమే కనిపెట్టావు. దొంగలను కనిపెట్టలేదు," అన్నాడు రాజు సూక్ష్మదృష్టితో.

"పోనివ్వండి, మహారాజా! పోయిన ధనం యావత్తూ దొరికిందిగనక దొంగలను గురించి విచారించకండి!" అన్నాడు సూక్ష్మదృష్టి.

"అలా కాదు. నీకు రోజుకు నూరు వరహాలిస్తున్నది దొంగలను పట్టటానికి!" అన్నాడు రాజు.

"మహారాజా, పోయిన సొత్తు ఎక్కడున్నదీ కనిపెట్టకపూర్వమే చోరులను, వారి పాదరేఖలనుబట్టి కనిపెట్టాను," అన్నాడు సూక్ష్మదృష్టి.

"అయితే వారెవరో చెప్పు. వెంటనే దండిస్తాను!" అన్నాడు రాజు, సూక్ష్మదృష్టి సామర్థ్యంలో పూర్తి విశ్వాసం లేక.

"నన్నేమి చెప్పమంటారు? ఇద్దరు కలిసి ఈ దొంగతనం చేశారు. ఆ ఇద్దరిలో ఒకరు తమరూ, రెండవవారు మహామంత్రిగారు!" అన్నాడు సూక్ష్మదృష్టి.

సూక్ష్మదృష్టి అసాధారణ ప్రజ్ఞకు సంతోషించి కాశీరాజు, అతని జీతం రెట్టింపుచేసి, శాశ్వతంగా కొలువులో వుంచుకొన్నాడు.



# లౌక్యంలేని విద్యలు




ఒక ఊళ్ళో నలుగురు యువకులు వుండేవారు. వారు బాల్యమిత్రులు. అందులో ముగ్గురికిమాత్రం ఒక పండితుడివద్ద సర్వవిద్యలూ పట్టుబడినై. నాలుగోవాడికి లౌకికజ్ఞానం తప్ప, శాస్త్రజ్ఞానం అలవడలేదు.

కొంతకాలం గడిచిన తరవాత సర్వవిద్యలూ నేర్చిన ముగ్గురు మిత్రులూ దేశాటనం బయలుదేరారు. వాళ్ళు రాజులను సందర్శించి తమ విద్యలను ప్రదర్శించి ధనం సంపాయించాలనుకున్నారు. వాళ్లతోపాటు నాలుగవవాడుకూడా బయలుదేరాడు. కొంతదూరం వెళ్లిన తరవాత మొదటి ముగ్గురకూ, ఈ నాలుగవవాడు వెంట రావటం మనస్కరించలేదు, ఏ విద్యలూ, శాస్త్రాలూ తెలియని వీడు మన వెంట ఎందుకు? అనుకున్నారు.

"ఒరే బాబూ, నువ్వు వెనక్కి తిరిగిపో. నీమాత్రం లౌకికజ్ఞానం లేనివాడు ఈ లోకంలో ఎవడూ వుండడు. కనుక నీకు రాజాశ్రయం దొరకటంలాంటిది అసంభవం!" అన్నారు వాళ్ళు.

అందుకు నాలుగోవాడు వాళ్ళను బతిమలాడుతూ "నన్ను మీవెంట రానివ్వండి. మనమంతా బాల్యమిత్రులంగదా? నాకు రాజాశ్రయం దొరక్కపోతే ఏం? మిత్రులు మీకు సన్మానాలు జరుగుతూంటేనన్నా చూసి సంతోషిస్తాను" అన్నాడు.

ఆ ముగ్గురూ యిక ఎలాఅయినా వీడు వదలడనుకుని మెదలకుండా వూరుకున్నారు. కొంతసేపటికి నలుగురూ ఒక అడవిచేరారు. అక్కడ వారికి ఒక సింహపు

ఆర్. చలపతిరావు

అస్థిపంజరం కనబడింది. దాన్ని చూస్తూనే విద్యలన్నీ నేర్చినవాళ్ళలో ఒకడు ఆగి, "ఇదుగో యిక్కడ కనబడుతోన్న ఈ అస్థిపంజరం సింహానిది. మన విద్యా జ్ఞానాన్ని పరీక్షించుకునేందుకు యింతకంటె మంచి అవకాశం చిక్కదు. నేను యిప్పుడే చెల్లాచెదురుగావున్న అస్థిపంజరాన్ని ఒకటిగా కూరుస్తాను" అన్నాడు.

అదేవిధంగా అతడు అస్థికలన్నీ ఒక చోట చేర్చాడు. అప్పుడు రెండవవాడు, "అయితే నేను దీనికి నా మంత్రశక్తిచేత మాంసం, నెత్తురూ యిస్తాను" అని ఆ విధంగానే అస్థిపంజరంలో మాంసం, నెత్తురూ ప్రవేశపెట్టాడు.

అప్పుడు మూడవవాడు తక్కినవారిని పక్కకు నెట్టుకుంటూ ముందుకువచ్చి "ఐతే ఇక మీరు నాకు అవకాశం యివ్వండి. నేను సింహానికి ప్రాణం ఇస్తాను" అన్నాడు.

ఆ మాటలు విని నాలుగోవాడు అదిరిపోయ్యాడు. వాడు మూడోవాడి కాళ్లావేళ్లా పడుతూ, "ఇది సింహం, క్రూర జంతువని మనకు తెలుసుగదా? దానికి ప్రాణం ఇవ్వటం చాలా ప్రమాదకరం," అన్నాడు.

మూడోవాడికి ఈ మాటలు రుచించలేదు. "నాచేతనైన విద్యను సమయంవచ్చినప్పుడు ఉపయోగించకుండా చేయాలని చూస్తున్నావా? నేను కష్టపడి నేర్చుకున్న ఆ ఒక్క విద్యా ఎందుకు పనికొచ్చేట్టు?" అంటూ నాలుగోవాణ్ణి విదిలించాడు.

"సరే, మీ యిష్టం. నన్నుమాత్రం ముందు చెట్టు ఎక్కనివ్వండి," అంటూ నాలుగోవాడు చెట్టు ఎక్కాడు.

తక్షణం మూడోవాడు సింహానికి తన మంత్రశక్తిచేత ప్రాణంవచ్చేట్టు చేశాడు. ఆ వెంటనే అది గర్జిస్తూ లేచి ఆ ముగ్గురు మిత్రులమీదా పడి చంపివేసింది.





# ఐదు రొట్టెలు

ఒకనాడు సోమయ్యా, కామయ్యా అనే బాటసారు లిద్దరు దూరప్రయాణం చేస్తూ ఒక ఊళ్లో పేదరాసి పెద్దమ్మ ఇంట కలుసుకున్నారు. మర్నాడు ఉదయం వారు బయలుదేరేటప్పుడు పేదరాసి పెద్దమ్మ వారికి దిబ్బ రొట్టెలు మూటలు కట్టి ఇచ్చింది. సోమయ్యా కొంచెం ఉదార బుద్ధి కలవాడు. కామయ్యా కాస్త పిసినిగొట్టు. అందుచేత పేదరాసి పెద్దమ్మ సోమయ్యా మూటలో మూడు రొట్టెలు పెట్టి, కామయ్యా మూటలో రెండే ఉంచింది.

కొంతదూరంపాటు ఇద్దరి దారులూ ఒకటే కావటంవల్ల సోమయ్యా, కామయ్యా కలిసే బయలుదేరి, మిట్టమధ్యాన్నం వేళకి ఒక చెరువుగట్టున చెట్టు నీడను చేరుకున్నారు. వాళ్లు చెరువులో కాళ్లూ, చేతులూ, ముఖాలూ కడుక్కొని రొట్టెలు తినటానికి మూటలు విప్పేసరికి సోమయ్య మూటలో మూడు రొట్టెలూ, కామయ్య మూటలో రెండు రొట్టెలూ కనిపించాయి.

"చూశారా, పేదరాసి పెద్దమ్మ పక్షపాతం? నా మూటలో రెండే రొట్టెలు పెట్టింది," అన్నాడు కామయ్యా.

సోమయ్య నవ్వి, "రెండు రొట్టెలు మాత్రం తినగలమా? కానివ్వండి, అంతగా తినగలిగితే అయిదు రొట్టెలూ ఇద్దరమూ సమంగా పంచుకుని తిందాం. నాకేమీ అభ్యంతరంలేదు," అన్నాడు.

వాళ్ళు భోజనానికి కూచోబోయే సమయానికి ఆ చెట్టునీడకు రామయ్యా అనే మూడో బాటసారి వచ్చాడు.

"అయ్యలారా! ఆకలి దహించుకుపోతోంది. మీ ఆహారంలో కొంత నాకు యిస్తే మీరు ఋణం వుంచుకోను!" అన్నాడు రామయ్యా.

యస్. మార్కండేయులు

" మీరు కూడా మాతోపాటు భోజనం చేతురుగాని. మా రొట్టెలు ముగ్గురికీ సరిపోకపోవు," అన్నాడు సోమయ్య.

అడగటమే తడవుగా రామయ్యకూడా వారితోబాటు కూచున్నాడు. ఉన్న రొట్టెలను ముగ్గురూ పంచుకుతిని చెరువు నీరు తాగారు. రామయ్య మిగిలిన ఇద్దరికీ తన కృతజ్ఞత చెప్పుకుని సోమయ్య చేతిలో డబ్బులు పెట్టబోయాడు. సోమయ్య ఎంత వద్దన్నా వినకుండా అయిదణాలు అతడి చేతిలో పెట్టి తనదారిన వెళ్ళిపోయాడు.

సోమయ్య ఆ అయిదణాలలో రెండు తీసి కామయ్యకిస్తూ, "మీవంతు మీరు పుచ్చుకోండి. నావి మూడురొట్టెలు. మీవి రెండు రొట్టెలు. ఇందులో రెండణాలు మీకు చెందటం న్యాయం," అన్నాడు.

" ఇది చాలా అన్యాయం. రామయ్యకు మనం రొట్టెలు అమ్మలేదు. ఆయనే కృతజ్ఞతాపూర్వకంగా మన ఇద్దరికీ అని అయిదణాలిచ్చాడు. అందులో సగం మీదీ, సగం నాదీ. నాకు మరో అర్థణా వస్తుంది. దయచేసి ఇవ్వండి," అన్నాడు కామయ్య.

సోమయ్యకు అర్థణాగురించి కాపీనం లేకపోయినప్పటికీ, కామయ్య పిసినిగొట్టుతనం చూసి ఒళ్ళు మండుకొచ్చింది.




"పదండి. మనం దగ్గిర గ్రామానికి వెళ్ళి న్యాయాధికారినడిగి న్యాయం తేల్చుకుందాం. మీరు చెప్పేది నాకేమీ న్యాయంగా కనబడటంలేదు," అన్నాడు సోమయ్య.

ఇద్దరూ కొంతదూరం నడిచి ఒకగ్రామం చేరుకుని ఆ ఊరి న్యాయాధికారివద్దకు వెళ్ళి జరిగినదంతా చెప్పారు.

న్యాయాధికారి ఇద్దరి మాటలూ శ్రద్ధగా విని, కామయ్యకేసి తిరిగి, "న్యాయం చెప్పాలంటే, రామయ్య ఇచ్చిన అయిదణాలలో సోమయ్య వంతు నాలుగణాలు. నీవంతు ఒక అణా. కనుక నీవు సోమయ్యకు ఒక అణా ఇచ్చివెయ్యి!" అన్నాడు.

ఈ తీర్పు విని కామయ్య సిద్ధాంత పోయాడు. న్యాయాధికారి మరొక అర్ధణా ఇప్పిస్తాడనుకుంటే తననే ఒక అణా సోమయ్య కిమ్మంటున్నాడు!

"అయ్యా, ఇదేం న్యాయం? మా మా రొట్టెల సంఖ్యనుబట్టి చూసినా నాకు రెండణాలు రావాలికదా? నన్ను అణా మాత్రమే తీసుకోమంటారే?" అన్నాడు లోభి అయిన కామయ్య.

"అవును. నేను చెప్పినదే న్యాయం. అది ఎలా న్యాయమో చెబుతాను. అయిదు రొట్టెలను ముగ్గురు ఎలా పంచుకున్నారు?" అని అడిగాడు న్యాయాధికారి.

"చిత్తం! ఒక్కొక్క రొట్టెనూ మూడేసి భాగాలు చేశాం. పదిహేను భాగాలనూ ముగ్గురమూ మూడయిదులుగా తిన్నాం," అన్నాడు కామయ్య.

"నీ రొట్టెలను భాగించగా ఎన్ని ముక్కలయాయి?" అన్నాడు న్యాయాధికారి.

"చిత్తం! ఆరండి," అన్నాడు కామయ్య.

"అందులో అయిదు నీవే తిన్నావు. ఒకటిమాత్రం రామయ్యకిచ్చావు. సోమయ్య తెచ్చిన మూడురొట్టెలూ తొమ్మిది భాగాలయాయి. అందులో అయిదు మాత్రమే తాను తిని నాలుగింటిని రామయ్యకిచ్చాడు.

"రామయ్య తాను తిన్న అయిదు ముక్కలకూ అయిదణాలు ఇచ్చాడు. అందులో ఒకముక్క మాత్రం నీది, నాలుగు ముక్కలు సోమయ్యావి. రామయ్య ఇచ్చిన అయిదణాలలో నాలుగు సోమయ్యకు చెందుతాయి, ఒకటిమాత్రమే నీకు చెందుతుంది," అని న్యాయాధికారి వివరించాడు.

సోమయ్య తనకిచ్చిన రెండణాలలో ఒకటి తిరిగి ఇచ్చేసి కామయ్య, తన దురాశను నిందించుకుంటూ, తన దారిన తాను వెళ్ళాడు. న్యాయాధికారి కుశాగ్రబుద్ధిని మెచ్చుకుంటూ సోమయ్యకూడా తన ప్రయాణం సాగించాడు.






# అపవాదు

పూర్వం గొప్ప ధనవంతుడైన వైశ్యుడుండే వాడు. ఆయనకు సుబుద్ధి అనే ఒక కుమారుడూ, సుమిత్ర అనే కుమార్తె ఉండేవారు. ఆయన చనిపోతూ తన కొడుకుని దగ్గిరికి పిలిచి, "నాయనా, నా అనంతరం మన వ్యాపారం చక్కగా సాగించు. నీవూ, చెల్లెలూ సఖ్యతగా ఉండండి. ఇదే నా తుదికోరిక," అని చెప్పాడు.

తండ్రి పోయిన కొద్దికాలానికే సుబుద్ధి మూడు నౌకలమీద సరుకులు వేసుకుని దేశాంతరాలకు బయలుదేరాడు. బయలుదేరేటప్పుడు అతను తన చెల్లెలితో, "చెల్లీ, నేను చాలాకాలానికిగాని తిరిగిరాను. నేను లేని సమయంలో నీవు నీ ధర్మాన్ని అతిక్రమించవద్దు. పరులతో ప్రసంగించవద్దు," అని చెప్పాడు. తిరిగి ఎప్పుడు కలుసుకుంటామోనని సుబుద్ధి తన చిత్తరువును తన చెల్లెలికిచ్చి అమె చిత్తరువును తన వెంట తీసుకొని నౌకలతో సముద్రంమీద బయలుదేరాడు.

రెండేళ్ళు గడిచాయి. మూడో యేడు నడుస్తోంది. సుబుద్ధి నౌకలు ఒకానొక రేవు పట్టణం చేరుకొన్నాయి. అక్కడ లంగరు దించి, తన వెంట ఒక గిన్నెలో రత్నాలూ, రత్నకంబళాలూ మొదలైన బహుమానాలు తీసుకొని సుబుద్ధి ఆ దేశపు రాజు సుదర్శనుడివద్దకు వెళ్లాడు.

తాను తెచ్చిన బహుమతులు సుదర్శనుడికి సమర్పించి, "తమ దేశంలో వ్యాపారం చేసుకోవటానికి అనుమతి ఇవ్వండి," అని సుబుద్ధి అడిగాడు.

సుబుద్ధి తెచ్చిన బహుమానాలు చూసి సుదర్శనరాజు చాలా ఆనందించాడు. ఏ వణిజుడుకూడా తన కలాటి అమూల్యమైన

కె. బాలసుబ్రహ్మణ్యం



బహుమతు లిచ్చివుండలేదు. అందుచేత సుదర్శనుడు సుబుద్ధి కోరినప్రకారం వ్యాపారం చేసుకునేటందుకు అనుమతి నివ్వటమే గాక, అతను నౌకలో తెచ్చిన వస్తువులను చూడటానికి సపరివారంగా రేవుకుకూడా వచ్చాడు.

నౌకలోని వస్తువులను చూసి ఆనందిస్తున్న సుదర్శనరాజు కన్ను సుమిత్ర చిత్తరువుపై పడింది.

"ఎవ్వరీ సుందరవతి?" అని సుదర్శన రాజు సుబుద్ధిని అడిగాడు.

"ప్రభూ, ఆమె నా చెల్లెలు."

"అందానికి తగిన శీలంకూడా ఆమె కున్నదా?" అని అడిగాడు సుదర్శనరాజు.

"ఆమెశీలానికి వంక పెట్టగలవారు లేరు," అన్నాడు సుబుద్ధి.

"అయితే నేనామెను నా పట్టమహిషిగా చేసుకుంటాను," అన్నాడు సుదర్శనుడు.

ఇదంతా అలకిస్తున్న సేనానికి అసూయ జనించింది.

'చివరకు ఈ వైశ్యాంగన మాకు రాణి కావటమా? మా భార్యలు ఈమెకు సేవ చేయటమా?' అనుకున్నాడు దుర్మార్గుడైన సేనాని. అతను పైకిమాత్రం ఈ విధంగా అన్నాడు:

"ప్రభూ! ఈ స్త్రీని నేను బాగా ఎరుగుదును. ఈమె దుశ్శీల."

ఈ మాట వినగానే సుదర్శనుడికి సుబుద్ధిపై ఆగ్రహం కలిగింది.

"దుశ్శీలను శీలవతి అని ఎందుకు చెప్పావు? నీ తల తీయించేస్తాను," అన్నాడు రాజు సుబుద్ధితో.

"ప్రభూ! మీ సేనాని చెప్పేది అసత్యం. చేతనైతే అతను ఆ మాటలు రుజువు చేసుకోమనండి. నా చెల్లెలిని ఎరుగుదు నంటున్నాడు కాబట్టి, ఆమె వేలి ముద్రికను తీసుకురమ్మనండి, ఆమె పుట్టుమచ్చ

ఎక్కడ వున్నదీ తెలుసుకు రమ్మనండి," అన్నాడు సుబుద్ధి.

సుదర్శనుడికి ఇది న్యాయంగానే తోచింది. అయన తన సేనానితో, "రెండు నెలల కాలంలోగా నీవు ఈ స్త్రీ ఉంగరమూ, పుట్టుమచ్చ రహస్యమూ తెలుసుకొనలేక పోయినట్టయితే నీ తల తీయించేస్తాను," అని తెలియపరిచాడు.

సేనాని వెంటనే ప్రయాణమై సుమిత్ర ఉండే దేశానికి వచ్చాడు. అక్కడ ఒక పేదరాసిపెద్దమ్మవద్దకు వెళ్ళి తన పని చెప్పి, "పెద్దమ్మా, నా కా పిల్ల పుట్టుమచ్చ రహస్యమూ ఉంగరమూ తెచ్చిపెడితివా, నీకు అంతులేని బంగారం ఇస్తాను," అని ఆశపెట్టాడు.

పేదరాసిపెద్దమ్మ ధనాశచేత సుమిత్ర ఇంటికి వెళ్ళి ఆమెతో ఆ కబుర్లూ, ఈ కబుర్లూ చెప్పి, ఆమె వీపుమీద ఎడమ వైపున పుట్టుమచ్చ ఉన్నట్టు తెలుసుకొని, ఆమె ఉంగరాన్నికూడా తస్కరించి తెచ్చి సేనానికిచ్చింది.

సేనాని వెంటనే ప్రయాణంకట్టి స్వదేశానికి తిరిగివచ్చి సుదర్శనుడికి సుమిత్ర ఉంగరమూ, పుట్టుమచ్చ రహస్యమూ తెలియజేశాడు. సుమిత్రపై వేసిన అప



వాదును సేనాని రుజువుచేశాడు గనక సుదర్శనుడు కోపంతో సుబుద్ధికి మరణ దండన విధించాడు.

కాని సుబుద్ధి ఒక్క కోరిక కోరాడు :

"నేనీ దూరదేశంలో మరణించేముందు ఒక్కసారి నా చెల్లెలిని చూడాలని ఉన్నది. అమెను పిలిపించి ఒక్కసారి కలుసుకో నివ్వండి. తరువాత నిశ్చింతగా మరణ దండన అనుభవిస్తాను."

దీనికి సుదర్శనుడు అంగీకరించాడు. సుబుద్ధి తన చెల్లెలి కొక జాబు వ్రాసి సుదర్శనుడి దూతలద్వారా అమెకు పంపాడు. తన అన్న చెప్పినట్టు నడుచు

కోక పేదరాసిపెద్దమ్మతో మాట్లాడినందుకు ప్రమాదం సంభవించిందని తెలుసుకొని సుమిత్ర తన అన్నను కలుసుకోవటానికి బయలుదేరింది.

సువర్ణుడి రాజ్యం చేరుకోగానే ఆమె తిన్నగా రాజువద్దకు వెళ్ళి, "ప్రభూ, ఈ కర్ణాభరణం చూడండి. ఇది విలువయిన దేనా?" అని అడిగింది.

సుదర్శనుడు ఆమె ఇచ్చిన కర్ణాభరణంలోని రత్నాలను పరీక్షించి, "నిశ్చయంగా ఇది అమూల్యమైనదే. కాని దీనిని నాకెందుకు చూపుతున్నావు?" అని ఆశ్చర్యంగా అడిగాడు.

"తమ సేనాని దీని జతను నావద్ద తస్కరించాడు. తాము ధర్మస్వరూపులు. అది నాకు తిరిగి ఇప్పించండి!" అన్నది సుమిత్ర దీనంగా.

రాజు సేనానిని పిలిపించి సుమిత్ర చేసిన అరోపణను చెప్పి, "ఆమె కర్ణాభరణం దొంగిలించావట. దానిని వెంటనే ఆమెకు తిరిగి ఇచ్చెయ్యి," అన్నాడు.

సేనాని నిర్ఘాంతపోయి, "ప్రభూ, అసలీమె ఎవరో నే నెరగను. నా జన్మలో ఎన్నడూ నేనీమె ముఖమైనా చూసి ఉండలేదు. నే నీమె కర్ణాభరణం దొంగిలించటమేమిటి?" అన్నాడు.

వెంటనే సుమిత్ర రాజువైపు తిరిగి, "ప్రభూ! నేను సుబుద్ధిచెల్లెలు సుమిత్రను. నన్ను మీ సేనాని తన జన్మలో ఎన్నడూ చూసి ఉండకపోతే మా అన్నకు తమరు మరణదండన ఎందుకు విధించారు?" అని అడిగింది.

తన సేనాని చేసిన మోసమూ, సుమిత్ర చేసిన యుక్తీ సుదర్శనుడికి అర్థమైపోయింది. ఆయన తన సేనానికి మరణదండన విధించి, సుబుద్ధిని ఖైదువిడిపించి, సుమిత్రను పెళ్ళాడి చాలా కాలం సుఖంగా రాజ్యంచేశాడు.






ధారానగరంలో ఒక గజదొంగ ఉండేవాడు. అతడు చోరవిద్యలో ఆరితేరినవాడు. ఎందరో ధనికుల ఇళ్లు కొల్లగొట్టాడు, కాని అతనిని పట్టుకున్నవారు లేరు. అతనికి ప్రజలు రేచుక్క అని పేరుబెట్టారు. కాని ఈ రేచుక్క ఎవరో, ఎట్లా ఉంటాడో, ఎక్కడ నివసిస్తాడో చూసినవారు లేరు. అతనిని పట్టుకోవటానికి రాజు చేయించిన ప్రయత్నాలన్నీ విఫలమయాయి.

రేచుక్కకు ఒక కుమారుడుండేవాడు. ఇతను తండ్రిని మించినవాడు. కొడుకు తనకన్న చోరవిద్యలో యుక్తిమంతుడు కావటం చూసి రేచుక్క అతనికి పగటిచుక్క అని పేరుపెట్టాడు. పగటిచుక్కకు పదహారేళ్లు వచ్చాక తండ్రికొడుకు లిద్దరూ కలిసి దొంగతనాలకు పోతూ ఉండేవాడు. రేచుక్క పెద్దవాడైపోతూ ఉండటంవల్ల అతనికి పగటిచుక్క సహాయం అవసరమవుతూ ఉండేది.

ఒక రాత్రి తండ్రికొడుకులిద్దరూ కలిసి రాజుగారి ఖజానాకు కన్నంవేశారు. కన్నం వెలపల పగటిచుక్క నిలబడ్డాడు. రేచుక్క కన్నంలోనుంచి ఖజానాలోకి వెళ్ళి కొంత ధనమూ, సొమ్ములూ కొడుకు కందించి మళ్ళీ లోపలికి వెళ్లాడు. ఈసారి రేచుక్క చేతిలోనుంచి ఏదో వస్తువు కింద పడి చప్పుడయింది. ఈ చప్పుడుకు ఖజానా రక్షకభటులు పరిగెత్తుకుంటూ వచ్చి, అప్పుడే కన్నంలో తలదూర్చిన రేచుక్క మెడమీద కత్తితో బలంగా కొట్టారు. ఆ దెబ్బకు రేచుక్క తల బయటకీ, మొండెం లోపలికీ పడిపోయాయి. కన్నం వెలపల ఉన్న పగటిచుక్క తండ్రితల తీసుకుని ఇంటికి పారిపోయాడు.

ఆర్. నాగేంద్రం



అతను ఈవిషాదవార్త తల్లికి చెప్పాడు. ఆమె భర్తకోసం శోకించింది. బయటికి ఏడవవద్దనీ, ఏడిస్తే తమరహస్యం బయటపడుతుందనీ, పగటిచుక్క తల్లికి జాగ్రత్త చెప్పాడు.

మర్నాడు పగటిచుక్క మంచి దుస్తులు వేసుకుని పెద్దమనిషిలాగా రాజసభకు వెళ్ళాడు. అక్కడ రాత్రి జరిగిన దొంగతనంగురించి చర్చవచ్చింది. తల లేక పోవటంచేత చనిపోయిన దొంగ ఎవరెనదీ నిర్ధారణకాలేదు. కాని, కొంత [illegible]

జరిగినప్పుడు మరొక దొంగకూడా ఉండి ఉండాలని రాజు గ్రహించాడు.

చనిపోయిన దొంగ మొండెం బండిమీద పట్టణంలోని అన్ని వీధులూ తిప్పమనీ, దాన్ని చూసి ఎవరు ఏడిస్తే వారిని పట్టుకు రమ్మనీ రాజు తన భటులకు ఆజ్ఞ ఇచ్చాడు.

పగటిచుక్క రాజు వేసిన ఎత్తు గ్రహించాడు. ఒకవేళ తల్లిగనక తన తండ్రి శవాన్ని చూసి దుఃఖిస్తే తమకు రాజువల్ల ప్రమాదమని తెలుసుకున్నాడు. ఎట్లా ఐనా తల్లికి నచ్చచెప్పి ఆమె దుఃఖించకుండా చేయటం తనవిధిగా భావించాడు. ఆ వెంటనే రాజసభనుండి సరాసరి ఇంటికి వెళ్లాడు.

"రేపు నాన్న శరీరాన్ని మన వీధిలోకి తెస్తారు. అదిచూసి నువు గనక ఏడిచావంటే మన కొంప మునిగిపోతుంది. రాజు నేరస్థుల్ని పట్టేటందుకు ఈ ఎత్తు వేశాడు. కనుక నువ్వు ఏడవకుండా వుండాలి," అన్నాడు పగటిచుక్క తల్లితో.

"నాయనా, నీ తండ్రిని చూడకుండా ఎలా ఉంటాను? చూస్తే ఏడుపు రాకుండా ఎలా ఉం[illegible]" అన్నది తల్లి.

[illegible]

బీదవాళ్ళలాగా వేషాలువేసుకుని మరొక వీధికి వెళ్ళారు. అక్కడ పగటిచుక్క ఒక ములగచెట్టెక్కి కాయలు కోసుకుంటున్నట్టు నటించాడు. రేచుక్క శవం ఆ వీధిలోకి వచ్చేసరికి అతని భార్యకు పట్టరాని దుఃఖం వచ్చేసింది. అదే సమయంలో పగటిచుక్క చెట్టుమీదినుంచి పడిపోయాడు. ఆ దుఃఖంలో తల్లి పగటిచుక్క మీద పడి బావురుమంటూ, "అసలే తండ్రి లేనివాడివి, నీ కిదేం ఖర్మవచ్చి పడిందిరా, తండ్రీ!" అంటూ ఏడిచింది.

రాజభటులు ఆమెను ఊరడించి రేచుక్క శవంవున్న బండీతో ముందుకు సాగిపోయారు. వాళ్ళు రోజల్లా ఊరి వీధులన్నీ తిరిగినా ఫలితం కలగలేదు. ఇళ్లకు వెళ్ళిపోయారు. మర్నాడు రాజసభకు పగటిచుక్క మామూలుగా వెళ్ళాడు. రాజుగారు భటులను పిలిపించి అడిగారు:

'దొంగశవాన్ని చూసి ఎవరైనా ఏడిచారా?'

"లేదు మహాప్రభూ! ఒక అడుక్కుతినే మనిషి ఏడవటం చూశాంగాని ఆమె, తన కుమారుడు ములగచెట్టుమీదినుంచి కింద పడిపోయినందుకు ఏడిచింది" అని జవాబిచ్చారు భటులు.

ఆ ఏడిచిన మనిషి, రాజభటులు వచ్చే సమయానికే చెట్టుమీదినుంచి పడిన యువ





కుడూ దొంగ తాలూకు మనుషులై ఉండ వచ్చునని రాజుకు అనుమానం వేసింది. కాని వారు చేయిదాటిపోయారు. అందుచేత రాజు భటులకు మరొక ఆజ్ఞ ఇచ్చాడు:

"ఈరాత్రే దొంగ కళేబరాన్ని దహనం చేసెయ్యండి. కాని జాగ్రత్త! చెట్టుమీది నుంచి పడిపోయినవాడు చితిలో తనతండ్రి తలకాయను పడవేయటానికి తప్పక వస్తాడు. అప్పుడు వాణ్ణి పట్టుకోండి!"

రాజుగారి ఆజ్ఞప్రకారం ఆరాత్రి రాజ భటులు దొంగ కళేబరాన్ని శ్మశానానికి తీసుకుపోయి, చితిపేర్చి దహనంచేయ నారంభించారు. ఆ సమయంలో పగటి చుక్క ముఖమంతా మసిపూసుకుని, జుట్టు విరబోసుకుని, మెడలో గవ్వలపేర్లు వేసుకుని, ఎర్రబట్టలు కట్టుకుని, ఒకచేతిలో కత్తి, రెండోచేతిలో కాగడా పట్టుకుని, తండ్రి శిరస్సు మూటగట్టి భుజాన వేసుకుని, భీకరంగా అరుస్తూ, కాళ్ళకు గజ్జెలు కట్టుకుని పరిగెత్తుకుంటూ శ్మశానంలోకి వచ్చాడు. ఆ భయంకరాకారం చూసి రాజభటులు భూత మనుకుని చెల్లాచెదురుగా పారిపోయారు. అప్పుడు పగటిచుక్క చితిచుట్టూ ప్రదక్షిణం చేసి తండ్రితల చితిలోవేసి తనదారినతాను వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి జరిగిన వృత్తాంతం రాజు విని దొంగ కొడుకు సాహసానికి ఆశ్చర్యపడ్డాడు. ఆయన తన భటులతో ఈసారి ఈవిధంగా అన్నాడు:

"దొంగవాడి కొడుకు మళ్ళా మిమ్మల్ని మోసంచేశాడు. వాడు చితిలో పాలు పోయటానికి రేపు తప్పక వస్తాడు. కనక మీరు ఈసారైనా మోసపోకుండా వాణ్ణి కనిపెట్టి పట్టుకోండి!"

మర్నాడు శ్మశానంలో కాపలావున్న రాజభటులు ఒక గొల్లపిల్లవాణ్ణి చూశారు. వాడు నెత్తిమీద పాలకుండలు దొంతరలుగా పెట్టుకుని శ్మశానంమీదుగా రాజనగరుకేసి



వస్తున్నాడు. వాణ్ణి బుకాయించి పాలు తాగాలని రాజభటులు ఎత్తువేశారు. కాని వాడు ఒక్క చుక్కకూడా ఇవ్వలేదు. రాజభటులు వాణ్ణి భయపెట్టబోయారు. వారినుంచి తప్పించుకోవటానికా గొల్లపిల్ల వాడు చితివైపు వెళ్ళాడు. ఆ సమయంలో వాడి నెత్తిమీది పాలకుండలు చితిలో పడి పగిలిపోయాయి.

"చూడండి, మీమీద రాజుగారితో ఫిర్యాదుచేస్తాను," అంటూ గొల్లపిల్లవాడు ముందుకు సాగాడు. వాడికన్న ముందే రాజభటులు రాజుగారిదగ్గిరికి పరిగెత్తి, తాము ఏ పాపమూ ఎరగమనీ, తమమీద అసత్యపు ఫిర్యాదు చేయటానికి ఒక గొల్లపిల్లవాడు వస్తున్నాడనీ ఆయనకు విన్నవించుకున్నారు.

జరిగినదంతా విన్నమీదట. దొంగకొడుకు మళ్ళీ భటులను మోసంచేశాడని రాజుకు అర్థమయింది. ఇంత నేర్పరిని పట్టటం మామూలు భటులవల్ల కాదని రాజు సర్దారును పిలిపించి ఈ విధంగా చెప్పాడు:

"ఇవాళ రాత్రి దొంగకొడుకు తన తండ్రి అస్తికలు ఏరుకోవటానికి శ్మశానానికి వస్తాడు. నువు ఈ రాత్రి శ్మశానంలోనే కాపలా ఉండి వాణ్ణి ఎట్లాగైనా పట్టిన



ట్టయితే నీకు మంచి బహుమానం ఇస్తాను."

సర్దారు దొంగకొడుకును పట్టుకోవటానికి మంచి ఎత్తువేశాడు. దొంగను దహనం చేసిన చోటనే ఒక గుడారం వేసి, అందులో మంచంమీద తాను పడుకుని బయట భటులను కాపలావుంచాడు. ఎవరైనా అస్తికలకోసం వస్తే భటులను దాటి గుడారంలోకి రావాలి.

ఇదంతా తెలుసుకుని పగటిచుక్క ఆ రాత్రి చక్కని ఆడపిల్లవేషం వేసుకుని శ్మశానానికి వెళ్ళాడు. సర్దారు గుడారం బయట కాపున్న భటులు ఈ స్త్రీని చూసి ఆశ్చర్యపడి, "ఎవరు నువ్వు?" అని

గద్దిస్తూ ముందుకువచ్చి అడిగారు. "సర్దారుగారు రమ్మన్నారు," అన్నాడు పగటిచుక్క ఆడగొంతుతో. నిజమే కాబోలు ననుకుని భటులు పగటిచుక్కను గుడారంలోనికి పోనిచ్చారు.

పగటిచుక్క లోపలికి వెళ్ళి, మంచం మీద నిద్రపోతున్న సర్దారును లేపాడు. సర్దారు తుళ్ళిపడి లేచి, "ఎవతెవే నువ్వు?" అని గొంతు పట్టుకున్నాడు.

"అయ్యయ్యో, నా మెడలో హారం కాస్తా తెంపేశారు. ముత్యాలన్నీ కింద పడి పోయాయి," అన్నాడు ఆడవేషంలో వున్న పగటిచుక్క, మంచం కిందికి వొంగి ముత్యాలు ఏరుతున్నట్టు నటిస్తూ. "పో ముందు బయటికి!" అని బిగ్గరగా అరిచాడు సర్దారు.

"నా ముత్యాలు ఏరుకోనివ్వండి. అట్లాగే పోతాను," అంటూ పగటిచుక్క తండ్రి అస్తికలు ఏరుకుని వెళ్ళిపోయాడు.

దొంగ కొడుకు సర్దారునుకూడా మోసగించినట్టు రాజు గ్రహించాడు. ఆయన ఏకంగా తన మంత్రినే పిలిపించి, "మంత్రీ, ఈపని నీవల్లనే కావాలి. దొంగ కొడుకు తన తండ్రి అస్తికలను కలపటానికి ఏ చెరువుకో తప్పక వస్తాడు. అన్ని చెరువులవద్దా కాపలా ఏర్పాటు చేయించు. ఇందరిని







మోసంచేసి తనపనులు నేరవేర్చుకుంటున్న ఆ దొంగవాణ్ణి ఎట్లాగైనా పట్టుకోవాలి!" అన్నాడు.

ఈ సంగతి విని పగటిచుక్క ఒక ఉపాయం ఆలోచించాడు. అతను తన తండ్రి అస్తికలు పొడిచేసి నీటితో తడిపి శరీరమంతా రాచుకున్నాడు.

"అమ్మా, నీవు బిచ్చగత్తె వేషం వేసుకుని దేవుడి కోనేటిఒడ్డున వంటచేస్తూ ఉండు. నేనక్కడికి వచ్చి పిచ్చివాడిలాగా కోనేట్లో దూకేస్తాను. రాజభటులు నన్ను బయటికి తీసేలోగా నాన్న అస్తికలు నీటిలో కలిసిపోతాయి. నువు వండిన అన్నం విస్తట్లోపెట్టి నా దగ్గిరికి వచ్చి భోజనానికి పిలు. ఈలోగా కాకులు అన్నం తినేస్తాయి. నేను నీమీద కోపం వచ్చినట్టు కొట్టి నీ గాజులు పగలగొట్టేస్తాను. పుస్తెలు తెంచేస్తాను. నువు దెబ్బలకు తట్టుకోలేనిదానిలాగా కోనేట్లోకి ఉరికి స్నానంచెయ్యి. తరవాత నిన్ను నేనే బయటికి తీస్తాను. ఈ విధంగా నాన్నకు ఉత్తరక్రియలు పూర్తిచేద్దాం!" అని పగటిచుక్క తల్లితో చెప్పాడు.

అంతా అనుకున్న ప్రకారమే జరిగిపోయింది. దేవుడి కోనేటివద్ద జరిగిన సంఘటన వినగానే మంత్రికి సందేహం కలిగింది. ఆయన ఈ విషయం రాజుతో చెప్పగా రాజు, "ఏమీ సందేహం లేదు. వాళ్ళే చనిపోయిన దొంగ కొడుకూ, భార్యా. అయినా మించిపోయిందిలేదు. తండ్రికోసం ఇన్ని చేసినవాడు బ్రాహ్మణులకు దానధర్మాలు చెయ్యకపోడు. అందుచేత సంభావనలకు పోయే బ్రాహ్మణులమీద కాపలా పెట్టి దొంగ ఇల్లెక్కడో ఆరా తీయించండి!" అని హెచ్చరించాడు.

ఆరోజే దూరదేశంనుంచి కొందరు బ్రాహ్మణులు ధారానగరం చేరి సత్రంలో మకాంచేశారు. అర్ధరాత్రిపూట పగటిచుక్క సత్రం చేరి వారిని పిలుచుకుని సందు

గొందులవెంటా, తప్పుదారులవెంటా తిప్పి తన ఇంటికి తీసుకుపోయాడు. అక్కడ వారికి శాస్త్రోక్తంగా దానధర్మాలన్నీ చేసి తెల్లవారేలోపుగా వారిని తీసుకుపోయినట్టే తిప్పి తిప్పి సత్రంచేర్చి వెళ్ళిపోయాడు.

సత్రంలో దిగిన పరదేశి బ్రాహ్మణులు గతరాత్రి ఎక్కడో దానాలూ, సంభావనలూ తెచ్చుకున్నట్టు తెలిసి రాజభటులు వారిని ప్రశ్నించి జరిగిన సంగతి తెలుసుకున్నారు.

వారిని వెంటబెట్టుకొని పగటిచుక్క ఇల్లు ఎక్కడవుందో తెలుసుకొనేందుకు బయలుదేరారు. కాని చీకటిలో కొత్తచోట సందులు గొందులు తిరిగి, తెలియని ఇంటికి పోయిన బ్రాహ్మణులు రాజభటులకు పగటిచుక్క ఇల్లు చూపలేకపోయారు.

భటులు తిరిగివచ్చి రాజుకు సంగతి తెలియపరిచారు. పగటిచుక్క బ్రాహ్మణులను సరాసరి తన ఇంటికి తీసుకపోలేదనీ, సందులూ గొందులూ తిప్పి, వాళ్ళకు తన ఇల్లు గుర్తించే వీలులేకుండా చేశాడనీ చెప్పారు.

ఇంతయుక్తిగల దొంగకొడుకును పట్టటం శక్యంకాదని రాజుకు తెలిసిపోయింది. ఆయన సభలో, "మా భటులనూ, సర్దారునూ, మంత్రినీ మోసంచేసి తండ్రికి ఉత్తరక్రియలు జరిపిన యువకుడు తనను తాను బయటపెట్టుకున్నట్టయితే అతనిని క్షమించటమేగాక మా కుమార్తెనిచ్చి వివాహంచేస్తాము," అని ప్రకటించాడు.

పెద్దమనిషి దుస్తులతో ఆ సభలోనే ఉన్న పగటిచుక్క లేచినిలబడి, "మహాప్రభూ, నేనే ఆ దొంగను," అని చెప్పాడు.

రాజు అన్న మాటప్రకారం పగటిచుక్కకు తన కుమార్తెనిచ్చి వివాహం చేశాడు. పగటిచుక్క దొంగతనాలు మాని తన భార్యతో హాయిగా జీవించాడు.





# మహారాజయోగం

బుందేల్‌ఖండ్‌లో ఒకప్పుడు ఠాకుర్ వంశంవారు ప్రసిద్ధిగా పరిపాలించారు. ఆ వంశానికిచెందిన రూపసింహుడనేవాడు కడు పేదవాడు. అతనికి ధనంగాని, ఆస్తిగాని, చివరకు బంధువులుగాని లేరు. అతనికున్న ఆస్తియావత్తూ చినిగిపోయిన దుస్తులూ, రెండు గోనెపట్టాలూ, ఒక గొడ్డలీ.

ఈ గొడ్డలితో రూపసింహుడు ఉదయం నుంచి మధ్యాన్నందాకా అడవిలో కట్టెలు కొట్టి, వాటిని తెచ్చి మూడు రూపాయలకు అమ్ముకునేవాడు. అందులో రెండు రూపాయలు ఖర్చుపెట్టి చాకలివాళ్ళదగ్గిర రాజులు ధరించే దుస్తులు అద్దెకు తీసుకునేవాడు. మరొక రూపాయకు గుర్రం ఒకటి అద్దెకు తీసుకునేవాడు. ఆ బట్టలు ధరించి గుర్రంఎక్కి, వాయువేగంతో నగరపు వీధుల వెంట రాజఠీవితో సవారీఅయి వెళ్ళేవాడు. మంచి యువకుడూ, అందగాడూ అయిన ఈ వ్యక్తినిచూసి అందరూ అతనెవరో రాజనుకునేవారు. ఈ విధంగా రూపసింహుడు ప్రతిరోజూ ఠాకుర్ రాజవంశ గౌరవాన్ని నిలబెట్టి, చీకటిపడగానే దుస్తులనూ, గుర్రాన్నీ తిరిగి ఇచ్చివేసి, తన మామూలు దుస్తులు ధరించి, చిల్లరడబ్బులతో ఇన్ని మరమరాలూ, శనగపప్పూ కొని తిని, కాసిని మంచినీళ్ళు తాగి, ఒక గోనెపట్టా నేలమీద పరుచుకుని, మరొకటి మీద కప్పుకుని నిద్రపోయేవాడు. తిరిగి మర్నాడు ఉదయం గొడ్డలి భుజాన పెట్టుకుని కట్టెలు కొట్టటానికి అడవికి బయలుదేరేవాడు.

ఒకనాడు రూపసింహుడు అడవిలో కట్టెలు కొడుతూఉండగా అతనికి సమీపం నుంచి సువాసన తగిలింది. సమీపానికివెళ్ళి చూసేసరికి మంచిగంధపుచెట్టు కనిపించింది. రూపసింహుడు గొడ్డలితో మంచిగంధపుచెట్టు బెరడు కొంత చెక్క తీసుకుని,

జి. కృష్ణానందశర్మ





యథాప్రకారం కట్టెలు కొట్టుకుని సాయం కాలానికల్లా నగరానికి తిరిగివచ్చాడు.

ఆ సాయంకాలం రూపసింహుడు రాజ దుస్తులు ధరించి గుర్రంమీద ఎక్కి వాయు వేగంతో సవారీ అయిపోతూండగా నగరపు కూడలిలో ఒక పరదేశి అతనికి ఎదురై "నమస్కారం, మహాప్రభూ!" అన్నాడు.

"ఎవరవోయ్ నీవు?" అని ఠీవిగా ప్రశ్నించాడు రూపసింహుడు.

"ప్రభూ, నేను వ్యాపారం చేసుకునే వాణ్ణి. తమదేశంలో వ్యాపారం ముగించు కొని సింహళానికి పోతున్నాను," అని విన్న వించుకొన్నాడు పరదేశి.

రూపసింహుడు కొంచెం ఆలోచించి తన జేబులోనుంచి గంధపుచెట్టు బెరడు తీసి, పరదేశికి యిస్తూ "ఠాకుర్ రూపసింహుడి కానుకగా దీనిని సింహళరాజుకు అంద చెయ్యి. నీపని సానుకూలం అవుతుంది!" అని, తన గుర్రాన్ని అదిలించి శరవేగంతో వెళ్ళిపోయాడు.

ఆ ప్రకారమే వర్తకుడు రూపసింహుడి కానుకను సింహళరాజుకు అందజేశాడు. గంధపుచెక్క ఎరగని సింహళరాజు ఠాకుర్ రూపసింహుడి కానుకకు ముగ్ధుడై, వర్త కుడికి సమస్త సదుపాయాలూ చెయ్యటమే గాక, అతనిద్వారా రూపసింహుడికి రత్నాలు పొదిగిన పాదుకలు బహుమానంగాపంపాడు.

ఆ వర్తకుడు తిరిగివచ్చి రూపసింహుడి కొరకు నగరు కూడలిలో వేచివుండగా రూప సింహుడు గుర్రంమీద వచ్చాడు.

"నమస్కారం, మహాప్రభూ!" అన్నాడు వర్తకుడు.

"ఎవరవోయ్ నీవు?" అన్నాడు రూప సింహుడు, గుర్రం ఆపి.

"మహాప్రభూ, నేను పరదేశి వ్యాపారిని. తాము పంపిన కానుక సింహళరాజుకు అందజేశాను. ఆయన తమకీ పాదుకలు పంపారు." అన్నాడు వర్తకుడు.

"నీవిప్పుడు ఏ దేశానికి పోతున్నావు?" అని అడిగాడు రూపసింహుడు.

"అరేబియాదేశం వెళ్ళుతున్నాను," అన్నాడు వర్తకుడు.

"అయితే అరేబియా చక్రవర్తికి ఈ పాదుకలను మా కానుకగా బహూకరించు. నీ పని సానుకూలమవుతుండి," అంటూ రూపసింహుడు గుర్రాన్ని అదిలించి, శర వేగంతో వెళ్ళిపోయాడు.

వర్తకుడు అలాగే చేశాడు. అరేబియా చక్రవర్తి రత్నాలు పొదిగిన పాదుకలు చూసి, అటువంటి అమూల్యమైన కానుక పంపిన రాజు సామాన్యుడైవుండడని భావించాడు. అరేబియాదేశపు గుర్రాలు ఉత్త మాశ్వాలు. అటువంటి అశ్వాలలో ఉత్త మోత్తమమైనవి నూరు తెప్పించి చక్రవర్తి వర్తకుడికి ఇచ్చాడు.

"రూపసింహ ఠాకుర్‌గారికి మా సలాములు చెప్పి, ఈ నూరు గుర్రాలు మా కానుకగా వారికి అందచెయ్యి. వారు పంపిన కానుక ఆనందాన్ని కలిగించింది. అని చక్రవర్తి వర్తకుడికి చెప్పాడు.

వర్తకుడు ఆ నూరు గుర్రాలనూ శ్రద్ధగా వెంటపెట్టుకునివచ్చి మామూలుప్రకారం కూడలిలో నిలబడ్డాడు. త్వరలోనే రూప



సింహుడు గుర్రంమీద వాయువేగంతో వచ్చి వర్తకుణ్ణి చూసి ఆగాడు.

వర్తకుడు నూరు అరేబియా గుర్రాలనూ చూపి, "మహాప్రభూ, అరేబియా చక్రవర్తి మీకు వీటిని కానుకగా పంపారు. స్వీకరించండి!" అన్నాడు,

"నీ విప్పుడు ఏ దేశం పోతున్నావు?" అని అడిగాడు రూపసింహుడు.

"నేను తిరిగి సింహళం పోతున్నాను," అన్నాడు వర్తకుడు.

"అయితే వీటిని తీసుకుపోయి సింహళ రాజుకు మా కానుకగా ఇయ్యి," అంటూ రూపసింహుడు వేగంగా వెళ్ళిపోయాడు.

వర్తకుడు నూరు అశ్వాలనూ సింహళ రాజుకు సమర్పించి, అది రూపసింహ ఠాకుర్ కానుక అని విన్నవించాడు.

ఈ కానుక చూడగానే సింహళరాజు హృదయం ద్రవించింది. రూపసింహుడు పంపే కానుకలు అమూల్యమైనవే గాక, అతని స్నేహం మరింత విలువైనదిగా కనిపించింది. రూపసింహుడు యువకుడనీ, అందగాడనీ వర్తకుడివల్ల విని సింహళ రాజు తన ఏక పుత్రికను అతనికిచ్చి పెళ్ళిచేయ తలపెట్టాడు. రూపసింహుడి కొరకు రాజోచితమైన దుస్తులూ, అభరణాలూ ఇచ్చి, పెద్ద పరివారాన్ని వర్తకుడి వెంట పంపాడు.

రూపసింహుడి నివాసస్థానం తెలియని కారణంచేత వర్తకుడు సింహళరాజు పంపిన పరివారాన్ని నగరపు కూడలిలో వుంచాడు. సాయంకాలం కాగానే రూపసింహుడు గుర్రంమీద వాయువేగంతో వచ్చాడు.

వర్తకుడు రూపసింహుడికి తాను తెచ్చిన సందేశం అందజేశాడు. రూపసింహుడు, సింహళరాజు పంపిన వస్త్రాభరణాలు తీసుకొని, మర్నాడు అదేచోట కలుస్తానని వర్తకుడికి చెప్పి వెళ్లిపోయాడు.

ఇప్పుడు రూపసింహుడు తన అరువు దుస్తులనూ, గుర్రాన్ని ఇచ్చివేసి, సింహళ రాజు పంపిన దుస్తులనూ ఆభరణాలనూ ధరించి ఆరోజు కట్టెలమ్మగా వచ్చిన డబ్బుతో మేనా చేయించుకొని సాయంకాలానికి కూడలికి చేరాడు. అక్కడ అతని కోసం వర్తకుడూ, సింహళరాజు పరివారమూ సిద్ధంగా ఉన్నారు. అందరూ కలిసి సింహళదేశానికి ప్రయాణమై వెళ్లారు.

సింహళరాజకుమార్తెకూ రూపసింహుడికీ వైభవంగా వివాహం జరిగింది. సింహళ రాజుకు కుమారులు లేనందున, కాలక్రమాన రూపసింహుడే సింహళానికి రాజై చాలా కాలం పరిపాలించాడు.





# మందమతులు

ఒక ఊరిలో పోలయ్యా అని ఒకడుండే వాడు. అతనికి దగ్గిరబంధువులెవరూ లేరు, ఇల్లూవాకిలీకూడా లేదు. అందుచేత అతను ఒక రైతుకుమార్తెను పెళ్లాడి అత్తవారింటనే ఉంటూవచ్చాడు.

పోలయ్యా భార్య నాగమ్మ మందమతి. ఆమె తల్లి నరసమ్మకూడా ఏమంత తెలివి గలదికాదు. ఒకనాడు నాగమ్మ తన పసి బిడ్డకు మామూలుప్రకారం నీళ్ళు పోసి, బట్టలు తొడిగి, కళ్ళకు కాటుక పెట్టి, మాడుకు ఆముదంరాచి తొట్టెలోపెట్టి జోల పాడుతూ ఊపసాగింది. జోలపాడుతున్న నాగమ్మ అకస్మాత్తుగా బిడ్డను ఊపటం మానేసి, "అయ్యో, నేనేంజేతునే!' అని శోకాలుపెట్టనారంభించింది.

ఈ శోకాలువిని దొడ్లో పనిచేసుకుంటున్న నరసమ్మ లోపలికి వచ్చి, ఏడుస్తున్న కూతుర్ని చూసి, "ఏం జరిగిందే, అమ్మా? త్వరగా చెప్పవే!" అని లబలబలాడింది.

నాగమ్మ పెద్దగా ఏడుస్తూ గోడమదురుమీద పెట్టిఉన్న చిన్నపెట్టెను చూపించి, "ఎలుకలకోసం అటుగా పిల్లివచ్చి ఆ పెట్టెను తన్నిందంటే అదికాస్తా ఉయ్యాలలో ఉన్న నా బిడ్డమీద పడి బిడ్డ చచ్చిపోతుందే!" అని తల్లిని కావిలించుకుని మరీ బిగ్గరగా ఏడవటం మొదలుపెట్టింది.

"నిజమేనే, తల్లీ! నీ బిడ్డకెంత ఆపద వచ్చిందే!" అని నరసమ్మకూడా కూతురితో బాటు ఏడుపు సాగించింది.

తల్లికూతుళ్ళు ఈ తీరుగా ఏడుస్తున్న సమయంలో బయటినుంచి పోలయ్యా వచ్చాడు. వాళ్ళదుఃఖానికి కారణం తెలుసుకుని మండిపడ్డాడు.

"లోకంలో ఇంతమంది బుద్ధిహీనులను చూశానుగాని, మీ తల్లికూతుళ్ళంత మందమతులను నేనెక్కడా చూడను. ఈ క్షణమే

ఐ. నాంచారయ్యా



నేను దేశాలమీద పోతున్నాను. ప్రపంచంలో మీకన్నకూడా మందమతులు కనిపించిన పక్షంలో తిరిగివస్తాను. లేకపోతే నేను మళ్ళీ మీ మొహం చూసేది లేదు," అంటూ పోలయ్య దేశాలమీద బయలుదేరాడు.

పోలయ్య కాలినడకను చాలాగ్రామాలు దాటి ఒకనాటి ఉదయం ఒక గ్రామానికి చేరుకున్నాడు. ఊరి బయట పోలయ్యకు ఒక నడివయస్సు మనిషి కనిపించాడు. ఆ మనిషి చేతిలో ఒకతట్ట ఉన్నది. అ తట్టను సూర్యుడికి చూపించి ఇంట్లోకివెళ్లి, మళ్ళీ బయటికివచ్చి, మళ్ళీ తట్టను సూర్యుడికి చూపిస్తున్నాడు. ఈవిధంగా అ వ్యక్తి నాలుగైదుసార్లు లోపలికి వెళ్ళిరావటం చూసిన పోలయ్య, "ఇదుగో మామా ? ఏమిటి నువ్వు చేస్తున్నపని ?" అని అడిగాడు.

"ఇల్లు రాత్రింబగళ్ళు ఒకటే చీకటి, అల్లుడా! ఎండను తట్టలోనింపి లోపల పోస్తున్నా. మూడునాళ్ళనుంచీ ఏన్నోతట్టల ఎండ లోపలపోశా. కాని ఏమీ లాభం లేకుండాఉంది," అన్నాడు రెండోమనిషి. ఆ మనిషి బుద్ధితక్కువకు పోలయ్య నవ్వుకుని, "మామా, మీయింటో గునపంఉందా? ఉంటే పట్టుకురా," అన్నాడు.

పోలయ్య గునపంతో ఆ ఇంటిగోడకు చిన్నకంత ఏర్పాటుచేశాడు.

"ఇప్పుడు చూడు, ఎండ మీ ఇంట్లోకి ఎట్లావచ్చిందో," అన్నాడు పోలయ్య.

ఇంటివాడు సంతోషించి, పోలయ్య తెలివికి తెగ మెచ్చుకున్నాడు.

పోలయ్య అక్కడినుండి బయలుదేరాక మరికొన్ని రోజులకు ఇంకో వూరు చేరుకున్నాడు. ఆ వూళ్లో ఒక కమ్మరి తన ఇంటి ప్రహరీగోడ దర్వాజాను పడగొట్టించటానికి కూలీలను తీసుకొచ్చాడు.

"పాపం, గట్టి దర్వాజాలాగుందే? ఎం పడగొట్టిస్తున్నారు?" అని పోలయ్య కమ్మరిని అడిగాడు.

"ఏం చెయ్యనండీ? పోలూ, చక్రాలూ, ఇరుసూ, చక్రిమూ తయారుచేసి బండీ చేస్తే దాన్ని బయటికి లాగటానికి గుమ్మం పట్టలేదు. అందుచేత కూలీలను పిలిపించి దర్వాజా పడగొట్టిస్తున్నాను. చేసేదేముందీ?" అన్నాడు కమ్మరి.

"పిచ్చివాడా, ఈ భాగ్యానికే దర్వాజా పడగొడతావా? నీబండీ ఊడగొట్టు. దాని భాగాలన్నీ బయటికి తీసుకొచ్చి బయటే బండి బిగించు," అన్నాడు పోలయ్య.

పోలయ్య తెలివితేటలకు కమ్మరి నిర్ఘాంత పోయాడు. దర్వాజా పడగొట్టటానికి తెచ్చిన కూలీలను పంపేసి పోలయ్య సలహా ప్రకారం చేశాడు.

మరి కొంతదూరం ప్రయాణం చేశాక పోలయ్యకు అతి విచిత్రమైన దృశ్యం కనబడింది. అదిచూసి పోలయ్యకు నవ్వాగలేదు. ఒక గొడ్లసావిడిలో ఒక మనిషి అటక మీద కూర్చుని ఉన్నాడు. కింద ఒక ఆవు ఉన్నది. ఆవు మెడలో కట్టినతాడు అటక మీద ఉన్నవాడి చేతిలో ఉన్నది. వాడు తాడును బలంకొద్దీ లాగుతూ, "పైకిరా! రావేం? ఎన్నాళ్లు తిండిలేక మాడతావు? నాలుగు రోజులుగా మాడుతున్నా ఇంకా బుద్ధి రాలా!" అని ఆవుతో అంటున్నాడు.



పోలయ్యా నవ్వుఆపుకుని, "అబ్బీ, ఏమిటి నువు చేస్తున్న పని? ఎందు కలా ఆవును హింస పెడుతున్నావు?" అని అడిగాడు.

"చూడండి, బాబూ. నాలుగు రోజుల క్రితం ఆవును కొన్నా. దానికోసం గడ్డి కొని భద్రంగా అటకమీద పెట్టా. పైకివచ్చి గడ్డి తినవే, అంటే -ససేమిరా రాదు! ఇట్టా అయితే ఈ ఆవేం బతుకుతుందో నాకు తోచటంలేదు," అన్నాడు అటకమీదివాడు.

"నువ్వెక్కడో బుద్ధిహీనుడులాగున్నావు! ఆవులు అటక లెక్కుతాయా? నువ్వే అటక మిదినుంచి గడ్డి తెచ్చి ఆవుకు వెయ్యాలి గాని!" అన్నాడు పోలయ్యా.

అటక మీదివాడికి నాలుగు రోజులుగా ఈ ఆలోచనే తట్టలేదు. వాడు వెంటనే కొంత గడ్డి తీసుకొని అటకమీదినుంచి దిగి వచ్చి ఆవుముందు వేశాడు. వెంటనే ఆవు దానిని తిన నారంభించింది.

ఆవు యజమాని పోలయ్యా కాళ్లమీదపడి, "బాబూ, నా ఆవునూ, నన్నూ రక్షించారు. మీ మేలు ఎన్నటికి మరవను!" అన్నాడు.

పోలయ్యా తనలో తాను ఈ విధంగా ఆలోచించుకున్నాడు:

"ప్రపంచంలో ఇటువంటి మందమతు లున్నారని నేను ఎరగను. తట్టతో ఎండను ఇంట్లో వేసేవాడూ, బండి బయటికి తీయ టానికి దర్వాజా పడగొట్టించేవాడూ, మేత కోసం ఆవును అటక ఎక్కించేవాడూ! వీరి కన్న నాభార్య మందమతి ఎంతమాత్రం కాదు. నిజం ఆలోచిస్తే పిల్లులు గోడ మదుర్లమీద నడిచి వస్తువులు పడదోయటం కద్దు. ఆ ఎత్తునుంచి పెట్టెలాటిది పడితే పసికందుకు నిజంగా ప్రమాదమే."

ఈమాట అనుకుంటూనే పోలయ్యా ఇంటికి తిరిగిపోయి, తన భార్యతో, బిడ్డలతో సుఖంగా కాపరం చేశాడు.





# సూది తెచ్చిన సౌభాగ్యం

వెనక కోసల దేశంలో ముగ్గురు మిత్రు లుండేవారు. వారిలో ఇద్దరు—నందుడు, సునందుడు అనేవారు ధనికులు. మూడవ వాడు ఆనందుడు గర్భదరిద్రుడు. అతను తాళ్ళు పేనుకొని జీవించేవాడు. అతణ్ణి ఏ విధంగానైనా ధనికుణ్ణి చెయ్యాలని నందుడూ, సునందుడూ ఆలోచన చేశారు.

"పెట్టుబడికి కొంతధనం ఉన్నట్టయితే ఎవరైనా ధనికుడు కావచ్చు. కనుక ఆనం దుడికి కొంత మూలధనం ఇద్దాం," అన్నాడు నందుడు.

"ఎంతమంది ధనికులు దరిద్రులై పోవటంలేదు? కలిసివచ్చినట్టయితే పెద్ద పెట్టుబడి లేకుండానే ధనికుడైపోవచ్చు," అన్నాడు సునందుడు.

తనమాట నిజమని రుజువు చేయటాని కని నందుడు మర్నాడు ఆనందుడికి రెండు వందల మాడలిచ్చాడు. వాటితో ఏదైనా వ్యాపారం చేసుకొని ధనం సంపాదించమని చెప్పాడు. ఆనందుడు సంతోషించి, ఆ రెండువందల మాడలలో పది ఖర్చుకుగాను తీసి, మిగిలినవి తన తలపాగాలోనే భద్రంగా మూటకట్టి, ఇంటికి కావలిసిన వెచ్చాలు కొనటానికి బజారుకు బయలుదేరాడు. దుర దృష్టవశాత్తూ దారిలో ఒక పక్షి ఎటునుంచో వచ్చి, ఆనందుడి తలపాగాలో మూటచూసి అందులో ఏదో ఉన్నదనుకొని తన్నుకు పోయింది. నూటతొంభైమాడలూ రెక్కలు వచ్చి ఎగిరిపోయినందుకు ఆనందుడు చాలా విచారించాడు.

తరువాత కొద్దిరోజులకు నంద సునం దులు ఆనందుడి ఇంటికివచ్చి, తమస్నేహి తుడి పరిస్థితిలో మార్పు లేనందుకు కారణం అడిగారు.

"నా అదృష్టం బాగులేదు. డబ్బంతా తలపాగాలో చుట్టుకొన్నాను. కాని ఏదో

బి. శివన్నారాయణ



పక్షి వచ్చి తలపాగా తన్నుకుపోయింది," అన్నాడు ఆనందుడు విచారంగా.

ఈ వృత్తాంతం నందుడు నమ్మాడుగాని సునందుడు నమ్మలేదు; ఆనందుడా డబ్బును దుర్వినియోగపరిచి ఉంటాడను కున్నాడు. నందుడు మాత్రం ఆనందుడికి మరొకసారి రెండు వందల మాడలిచ్చి, "ఈసారిఅయినా డబ్బు భద్రంగా ఉంచు కొని, దాని సహాయంతో ధనం సంపాదించు," అని సలహాయిచ్చాడు.

ఈసారి ఆనందుడు తనకు కావలసిన మాడలు తీసుకొని, మిగిలినవి తవుడుతట్ట అడుగున భద్రంగా దాచి, ఇంటికి కావల సిన సంబారాలు పట్టుకువద్దామని బజా రుకు వెళ్ళాడు. అతను తిరిగివచ్చేసరికి తవుడుతట్ట కనబడలేదు. భార్యనడిగాడు.

"ఉప్పు అమ్మకానికి వచ్చింది. దగ్గిర డబ్బులు లేవు. అందుకని తవుడుతట్ట అమ్మి రెండు శేర్లు ఉప్పు తీసుకున్నాను," అన్నది ఆనందుడి భార్య.

ఆనందుడికి పట్టరాని దుఃఖం కలిగింది. తనకు డబ్బు దక్కించుకొనే యోగం లేదని అతను తేల్చుకొన్నాడు.

మరి కొద్దిరోజులకు నంద సునందులు మళ్ళీ వచ్చి జరిగిన సంగతి విన్నారు. ఆనందుడు ఎప్పటికన్న దరిద్రుడుగా కని పించాడు. అతడు బట్టల చిరుగులుకూడా కుట్టుకొలేదు. కారణమేమంటే ఇంట్లో సూదికూడా లేదని చెప్పాడు.

అప్పుడే బజారులో సూదుల పొట్లం కొన్న సునందుడు ఆనందుడికి ఒక సూది ఇచ్చి, "ఇది పెట్టి నీ భార్యచేత చిరుగులు కుట్టించుకో!" అన్నాడు. తరువాత నంద సునందులు వెళ్ళిపోయారు.

అరోజు రాత్రే పక్కయింటి బెస్తవాడి భార్య ఆనందుడి భార్యవద్దకు వచ్చి, "అక్కా, మీ ఇంట్లో సూది వుంటే కాస్త ఇస్తావా? రేపు ఉదయమే మావాళ్ళు

వలలు పట్టుకొని చేపలు పట్టబోతున్నారు. వల బాగుచేసుకోవాలి. వలలో మొదట పడిన చేపలు మీకిస్తాంలే!" అన్నది.

ఆనందుడి భార్య ఆమెకు ఇంట్లోవున్న సూది అరువు యిచ్చింది.

మర్నాడు సాయంకాలం చేపలతో తిరిగివచ్చిన బెస్తవాడు తన కూతురు చేతికిచ్చి ఆనందుడి ఇంటికి పెద్ద చేపను పంపాడు. కూర వండుదామని ఆనందుడి భార్య ఆ చేపను కోసేసరికి అందులో పెద్ద గాజుముద్దలాటిది దొరికింది. ఆ గాజు ముద్దతో ఆనందుడి పిల్లలు వీధిలో ఆడుతూండగా చూసిన నగల వర్తకుడు ఆనందుడిదగ్గిరికి వచ్చి, "ఆ గాజుముక్క నాకు అమ్ముతావా, ఆనందయ్యా? నూరు మాడలిస్తాను!" అని అడిగాడు.

అది చాలా విలువైన గాజుపెంకు అయి వుండాలని అనుమానం తగిలి ఆనందుడు దానిని అమ్మ నిరాకరించాడు. ఆరోజే దానిని నగరానికి పట్టుకుపోయి రత్నాల వర్తకులకు చూపించాడు.

నిజానికి అదొక అమూల్యమైన వజ్రం. దానిని పెద్ద వర్తకుడు ఇరవైవేల మాడలిచ్చి కొనుక్కొన్నాడు. ఆ ధనంతో ఆనందుడు ఇళ్ళూ, దొడ్లూ కొన్నాడు. తాళ్ళు పేనటానికి కర్రలతో యంత్రాలు చేయిం



చాడు, తాళ్ళపరిశ్రమ ఏర్పాటు చేశాడు, ధనికుడైనాడు.

ఆనందుడు అకస్మాత్తుగా ధనికుడైన వార్త తెలియగానే అతని మిత్రులు నంద సునందులు అతనిని చూడవచ్చారు.

"నేనిచ్చినడబ్బు పెట్టుబడిచేసే ధనికుడ వయావు. అవునా?" అన్నాడు నందుడు.

ఆనందుడు జరిగినదంతా పూసగుచ్చి నట్టు మిత్రులకు చెప్పాడు.

"కలిసివచ్చేసరికి నే నిచ్చిన సూదితోనే ఆనందుడు ధనం సంపాదించాడు, చూశావా?" అన్నాడు సునందుడు.

ఈసారి నందుడికి నమ్మకం కలగ లేదు. ఆనందుడు తన ధనంతోనే ధని కుడై, ఆ సంగతి కప్పిపుచ్చటానికి అబద్ధ మాడుతున్నాడనుకొన్నాడు.

మిత్రులు ముగ్గురూ కలిసి ఆనందుడు కొత్తగా కట్టించిన ఇల్లూ, వెనక వున్న దొడ్డీ చూడటానికి బయలుదేరారు. వారు దొడ్లోకి వెళ్లేసరికి ఆనందుడి పిల్లలు ఒక చెట్టు ఎక్కి దానిమీద వున్న పక్షిగూడు కింద పడేశారు. అందులో ఆనందుడి తలపాగా కనిపించింది. దాని చెంగున మూటకట్టి వున్న నూటతొంభై మాడలూ దొరికాయి.

వారక్కడినుండి బయలుదేరి గొల్లసావి డికి వచ్చారు. అదే సమయంలో బజారు నుంచి నౌకరు ఒకడు తవుడుతట్ట కొని తెచ్చాడు. వాడు దానిలోనుంచి తవుడు తీసి కుడితిలో పోస్తూండగా బంగారు మాడలు కొన్ని వాడిచేతిలోకి వచ్చాయి. తట్ట బోర్లించిచూసేసరికి ఆనందుడు రెండవ సారి పోగొట్టుకొన్న నూటతొంభై మాడలూ కూడా దొరికాయి!

ఇది చూడగానే నందుడికి ఆనందుడి మాటలలో నమ్మకం కుదిరింది. సునం దుడు చెప్పినట్టు కలిసివస్తే ఐశ్వర్యం రావ టానిక కుట్టుసూది అయినా చాలునని నందుడు గ్రహించాడు.





# పాటలీపుత్రం

దక్షిణదేశంలో చించిని అనే ఒకానొక సముద్రతీరపట్టణంలో భోజికుడనే గృహస్థు ఉండేవాడు. ఆయనకు ముగ్గురు కుమార్తెలు. ఉత్తరదేశంనుంచి యాత్రార్థం వచ్చిన ముగ్గురన్నదమ్ములకు భోజికుడు తన ముగ్గురు కుమార్తెలనూ ఇచ్చి పెళ్లి చేశాడు. వారికి ఇల్లూ వాకిలి, చుట్ట పక్కాలూ లేనందున మామగారి ఇంటనే ఉండిపోయారు.

కొన్నాళ్లకు భోజికుడు వార్ధక్యంలో తపస్సుకొరకు గంగాతీరానికి వెళ్ళిపోయాక ఆ అన్నదమ్ములు ఇంటికి యజమానులు కూడా అయారు.

ఇలా ఉండగా ఆ ప్రాంతంలో భయంకరమైన కరువు వచ్చింది. బ్రతుకే దుర్భరమైపోయింది. ఈ స్థితిలో సంసారభారం మోయలేక ముగ్గురన్నదమ్ములూ భార్యలతో చెప్పకుండా పరారీ అయిపోయారు.

ఆ సమయంలో మధ్య ఆమె గర్భవతిగాకూడా ఉన్నది. భర్తలు ఇల్లువదిలి పారిపోగానే ముగ్గురు అప్పచెల్లెళ్ళూ కేవలం అనాథలైపోయారు. వారు చివరకు తమ తండ్రి అయిన భోజికుడికి మిత్రుడైన యజ్ఞదత్తుడి పంచచేరి చాలా కష్టపడుతూ జీవనం వెళ్లబుచ్చసాగారు.

కాలక్రమాన గర్భిణిగా ఉన్న ఆమె ప్రసవించి మగపిల్లవాణ్ణి కన్నది. తమ ముగ్గురికీ వాడే కొడుకుగనక అప్పచెల్లెళ్ళు వాణ్ణి ఎంతో గారాబంగా పెంచుతూ వాడికి పుత్రకుడని పేరుపెట్టుకున్నారు.

పుత్రకుడు పెద్దవాడై జీవనోపాధికొరకు ఉత్తరదేశం పోదామని ప్రయాణమయాడు. అతను వింధ్యప్రాంతం చేరుకుని ఒక అరణ్యంలోనుంచి పోతూండగా ఒకచోట ఇద్దరు మనుషులు హోరాహోరి ముష్టి యుద్ధం చేస్తూ కనిపించారు.

వి. అన్నమరాజు





"ఇది కొద్దిపాటి ఆస్తా? ఈ పావుకోళ్ళు తొడుక్కుంటే అదృశ్యరూపంలో ఆకాశ మార్గాన ఎక్కడికి పోవాలంటే అక్కడికి పోవచ్చు. ఈ తప్పేలాలో ఎప్పుడు కావాలంటే అప్పుడు కోరిన ఆహారం వస్తుంది. ఈ కర్రతో నేలమీద ఏ బొమ్మ గీస్తే అది నిజమవుతుంది," అని వాళ్ళు చెప్పారు.

"మీ బలాబలాలు పరీక్షించుకోవాలంటే ముష్టియుద్ధంకంటె మంచి ఉపాయం లేదా? ఇద్దరూ పరిగెత్తండి. ఎవరు వేగంగా పరిగెత్తితే వారికి మీ తండ్రి ఆస్తి వస్తుంది," అన్నాడు పుత్రకుడు.

ఈ పద్ధతి బాగుందని మాయాసురుడి కొడుకులు పరుగు పందెంవేసుకుని పరిగెత్త సాగారు. అదే సమయమనుకొని పుత్రకుడు కర్రా, తప్పేలా తీసుకుని పావుకోళ్ళు తొడుక్కొని అక్కడినుంచి అదృశ్యుడై ఆకాశ మార్గాన బయలుదేరాడు.

అతనలా కొంతదూరం వెళ్ళేసరికి ఒక చక్కని నగరం కనిపించింది. ఆ నగరం పేరు ఆకర్షిక. ఆపట్నంవింతలు చూడాలనే కుతూహలంతో పుత్రకుడు అక్కడ దిగి పేదరాసిపెద్దమ్మ ఇంటికి వెళ్లాడు.

ఆకర్షికా నగరపు రాజుకూతురు పాటలి చక్కనిచుక్క. ఆమె ఒక అనామకుణ్ణి

"చూడటానికి అన్నదమ్ముల్లాగున్నారు. ఈ కీకారణ్యానికి ఎందుకు వచ్చారు? ఎందుకు పోట్లాడుకుంటున్నారు?" అని వారిని అడిగాడు పుత్రకుడు.

వాళ్ళీ విధంగా సమాధానం చెప్పారు:

"మేము మాయాసురుడి కొడుకులం. మా తండ్రి ఆస్తిఅయిన పావుకోళ్ళూ, కర్రా, తప్పేలా మాలో ఎవరికి రావాలో తేల్చుకోవటానికి, బలశాలి ఎవరో చూసుకుంటున్నాం!"

పుత్రకుడు నవ్వి, "ఈ కొద్దిపాటి ఆస్తికి ఎవరైనా పోట్లాడుకుంటారా?" అని మళ్ళీ అడిగాడు.

పెళ్లాడుతుందని జ్యోతిష్కులు చెప్పటం వల్ల రాజు భయపడి తన మేడమీది ఆరవ అంతస్తులో ఆమెను భద్రంగా వుంచి, ఆమె శయనమందిరం వెలపల రక్షకభటులను రాత్రింబవళ్లు కాపలా ఉంచాడు.

ఈ వృత్తాంతం పేదరాసిపెద్దమ్మ చెప్పగా విని పుత్రకుడికి పాటలిని ఒక్కసారి చూడాలన్న కుతూహలం కలిగింది. ఆ రాత్రే అతను తన పాదుకల ప్రభావంతో రాజుగారి మేడ ఆరవ అంతస్తుకు చేరి అదృశ్యరూపంలో పాటలి శయనమందిరం ప్రవేశించాడు. పాటలి రూపలావణ్యాలు చూసి పుత్రకుడికి అమితానందం కలిగింది. దుర్భరమైన ఖైదు జీవితం అనుభవిస్తూ, విముక్తికొరకు ఎదురుచూస్తున్న పాటలికి, ఎవరూ తెలుసుకోకుండా తన శయనగృహం ప్రవేశించిన పుత్రకుడు దేవుడులాగా తోచాడు. వారిద్దరూ వివాహమాడటానికి నిశ్చయించారు. కాని ఈ వివాహానికి రాజు అంగీకరించడు. అందుచేత పుత్రకుడు పాటలిని తన చేతులలో ఎత్తుకొని, పాదుకలు ధరించి అదృశ్యరూపంలో ఆకాశ మార్గాన బయలుదేరాడు.

తెల్లవారేసరికి వారు చాలాదూరం వెళ్ళి ఒక చోట దిగారు. తప్పేలాలోనుంచి తమకు కావలసిన ఆహారం తీసుకొని ఆకలిబాధ తీర్చుకొన్నారు. అయితే రాజభోగాలకు అలవాటయిన పాటలి ఆ నిర్జన ప్రదేశంలో ఉండలేకపోయింది. ఆమె కోర్కె తీర్చటానికై పుత్రకుడు ఆ ప్రాంతంలో నేలమీద తన కర్రతో ఒక మహాపట్టణాన్ని గీశాడు. వెంటనే అక్కడ ఒక పట్టణం వెలిసింది.

ఆ పట్టణాన్ని పాటలీ పుత్రకులు కలకాలం ధర్మబుద్ధితో పరిపాలించారు. ఆ నగరమే పాటలీపుత్రం అనేపేర పురాణ ప్రసిద్ధమూ, చరిత్ర ప్రసిద్ధమూ కూడా అయింది. దానినే ఈ నాడు మనం పాట్నా అని పిలుస్తున్నాం.



# చందమామ

ఈ సంచికలో మీ అభిమానపత్రిక అయిన "చందమామ" గురించి అనేక విషయాలు చదువుతున్నారు. ఆకాశంలో కనిపించే మన చందమామను గురించికూడా కొన్ని వివరాలు తెలుసుకోండి.

* చందమామ మన భూమికి దగ్గిరిగా వచ్చినప్పుడు 2,21,600 మైళ్ళ దూరం ఉంటుంది; దూరంగా వెళ్ళినప్పుడు 2,52,970 మైళ్ళ దూరం ఉంటుంది.

* చందమామ చుట్టు కొలత 6,795 మైళ్ళు; మధ్యరేఖ 2,163 మైళ్ళు; విస్తీర్ణం 1,46,60,000 చదరపు మైళ్ళు; చందమామ బరువు 7 లక్షల 80 వేల కోట్ల, కోట్ల టన్నులు (7,80,000,00,00,000,00,00,000 టన్నులు.)

* భూమిచుట్టూ చందమామ తిరిగే వలయం నిడివి 15,00,680 మైళ్ళు; ఈ వలయంలో చందమామ గంటకు 2,288 మైళ్ళ వేగంతో ప్రయాణంచేసి, 27 రోజుల, 7 గంటల, 43 నిమిషాల, 11 సెకండ్లలో వలయాన్ని పూర్తిగా చుట్టివస్తుంది.

* పౌర్ణమిచంద్రుడు ఇచ్చే వెలుగుకన్న సూర్యుడి వెలుగు 6,18,000 రెట్లు హెచ్చు; చంద్రబింబంమీద పడే సూర్యరశ్మిలో నూరింట 17 వంతులు వెన్నెలరూపంగా మనకు వస్తుంది.

* చందమామ నిండా క్రేటర్‌లు అనే గొట్టలున్నాయి. వాటిలోకల్లా చాలా పెద్దది టోలెమి. దాని నిడివి 115 మైళ్ళు; అన్నిటికన్నా లోతైన క్రేటర్ పేరు థియోఫిలస్. దాని లోతు 19 వేల అడుగులు; చందమామలోకల్లా ఎత్తయిన పర్వతశిఖరం పేరు లైబ్నిట్జ్, దాని ఎత్తు 24,970 అడుగులు.

* భూమికి గల ఆకర్షణశక్తిలో చందమామకు గల ఆకర్షణశక్తి సుమారు ఆరోవంతు ఉంటుంది; భూమిమీద రెండు మణుగులు తూగేది చంద్రమండలంలో రెండున్నర వీశెలు తూగుతుంది.

* భూమిమీదకంటె చందమామలో శీతోష్ణాలు అధికం. పగటివేళ అక్కడి ఉష్ణం 200 డిగ్రీలుంటుంది. రాత్రివేళ మంచుకంటె 200 డిగ్రీలు చల్లగా ఉంటుంది.

* ప్రపంచంలోకల్లా పెద్ద టెలిస్కోప్‌తో చూస్తే చందమామ మనకు 25 మైళ్ళ దూరంలో ఉన్నట్టు కనిపిస్తుంది.

* చంద్రుడిలో నీరుగాని, గాలిగాని, ఏవిధమైన ప్రాణిగాని లేదు.

* భూమి సూర్యుడిచుట్టూ తిరిగే గ్రహం. చందమామ భూమిచుట్టూ తిరిగే ఉపగ్రహం.



# చందమామలో కుందేలు

పౌర్ణమినాటి రాత్రి మనం పూర్ణచంద్రుడికేసి చూసినట్టయితే చంద్రబింబం తెల్లగా ఉంటుంది. కాని దానిమధ్య కుందేలు ఆకారంలో మచ్చ ఉంటుంది. చందమామలో ఈ కుందేలు ఎలా వచ్చిందో మీకు తెలుసా ?

ఒకప్పుడు, అంటే చాలావేల వీళ్లక్రితం, చందమామ తెల్లగా, వెండిపళ్ళెంలాగా ఉండేవాడు. ఆ కాలంలో భూమిమీద ఒక అరణ్యంలో ఒక కుందేలూ, ఒక కోతీ, ఒక నక్కా, ఒక మానుపిల్లీ సఖ్యంగా ఉంటూవుండేవి. కుందేలు తన ముగ్గురు మిత్రులకూ ఉత్తమ మానవధర్మాలు చెబుతూ, పశుత్వంనుంచి బయటపడమని హితబోధ చేస్తూవుండేది. మిగిలిన జంతువులు తమ స్నేహితుడైన కుందేలును చూసి గౌరవించేవేగాని కుందేలు చెప్పే ధర్మాలను ఆచరించలేకపోయేవి. ఎందుచేతనంటే, కోతి చపలచిత్తం కలది, నక్క జిత్తులమారిది, మానుపిల్లి దొంగబుద్ధి కలది. కుందేలు ఎంత హితబోధ చేసినా వాటికి పుట్టుకతో వచ్చిన ఈ బుద్ధులు మారాయికావు.

ఇలావుండగా కార్తిక పౌర్ణమి వచ్చింది. ఆరోజు ఉదయం కుందేలు తన స్నేహితులతో, "అన్నలారా! ఇవాళ కార్తీక పౌర్ణమి. ఉపవాస దినం. పగలల్లా ఉపవాసం వుండి, పొద్దూకగానే అతిథులకు ఆహారం పెట్టి, అనంతరం చంద్రదర్శనం చేసుకొని మనం భోజనం చేసినట్టయితే మనకు ముక్తి లభిస్తుంది. నేను అలాగే చేయబోతున్నాను. మీరుకూడా అదేవిధంగా చేయవలసిందని నా కోరిక," అన్నది.

కోతీ, నక్కా, మానుపిల్లీ తలలు ఊపి, తాముకూడా పగలల్లా ఉపవాసం ఉండి, చంద్రోదయం కాగానే భోజనం చేస్తామని

ఆర్. సత్యవతి



కుందేలుకు మాట ఇచ్చి తలా ఒకదారినా బయలుదేరాయి.

ఉపవాసం ఉందామని నిశ్చయించుకున్న మరుక్షణంనుంచీ కోతికి ఎక్కడలేని ఆకలీవేస్తున్నట్టు తోచసాగింది. "అమ్మయ్యో, రాత్రి చీకటిపడేదాకా ఈ ఆకలికి తట్టుకోగలనా? బతికుంటే వచ్చే కార్తికపౌర్ణమికి ఉపవాసం ఉండొచ్చు," అని నిశ్చయించి కోతి పళ్లచెట్లకోసం వెతకనారంభించింది.

నక్క ఉపవాసంచేయటానికి పులులు తిరిగే ప్రాంతానికి వెళ్ళింది. కడుపు ఎంత మాడుతున్నాసరే ఆహారంమాత్రం ముట్ట రాదనుకున్నది. కాని కొంతదూరం వెళ్లాక ఒక పొదలో సగం తిన్న జింకశరీరం కనిపించింది. ఏ పులో దానిని చంపి కొంత తిని అక్కడ దాచివుంటుంది. తాను ఉపవాసం కారణంగా దానిని పొనిచ్చినట్టయితే చీకటిపడ్డాక తనకు ఆహారం దొరుకుతుందో, దొరకదో! అందుచేత నక్క ఉపవాసం ఆలోచన కట్టిపెట్టి వెంటనే భోజనానికి ఉపక్రమించింది.

మానుపిల్లి సాయంకాలందాకా పడుకుని నిద్రపోదామనే ఉద్దేశంతో ఒక చెట్టు ఎక్కింది. ఆ చెట్టు కొమ్మలలో దానికొక పక్షిగూడూ, పిల్లలూ కనిపించాయి. మానుపిల్లి వుపవాసం సంగతే మరచిపోయి పక్షిపిల్లలను కాస్తా భక్షించింది.

నలుగురు మిత్రులలో కుందేలు మాత్రమే సాయంకాలందాకా కటిక ఉపవాసం చేసింది. సూర్యాస్తమయమూ, చంద్రోదయమూ కూడా కాబోతున్నాయి. కుందేలుకు ఒకటే విచారం పట్టుకున్నది. అతిథి అభ్యాగతులెవరూ కనిపించలేదు. ఒంటరిగా భోజనంచేసేదానికన్న అతిథులకు పెట్టి తినటం ఎక్కువ పుణ్యం. అందుచేత కుందేలు అతిథులకోసం ఇంటిముందు నిలబడి ఎదురుచూడసాగింది.

కుందేలు నిష్ఠను కనిపెడుతున్న చంద మామ మానవరూపంధరించి ఆసమయంలో కుందేలును పరీక్షించటానికి వచ్చాడు.

"పొద్దుటినుండీ ఉపవాసం వున్నాను. ఈ అరణ్యంలో ఇంత భోజనం పెట్టేవారే లేరు. కాస్త నాకు భోజనంపెట్టి పుణ్యం కట్టుకుంటావా?" అని చందమామ కుందే లును అడిగాడు.

"అయ్యా, నాకు కావలిసిన ఆకు అల ములు ఇక్కడ పుష్కలంగా వున్నాయి గాని, నీకు తగిన భోజనం ఎక్కడ దొరుకు తుంది? అందుచేత నన్ను చంపి తిని నీ ఆకలి తీర్చుకొని నాకు ముక్తి ప్రసాదించు," అన్నది కుందేలు.

కార్తిక పౌర్ణమి పుణ్యదినంనాడు జీవ హింస చేయతగునా? నేను నిన్ను ఎట్లా చంపేది?" అని అడిగాడు చందమామ.

"అయ్యా, దానికి విచారించవద్దు. మీరు ఎండుపుల్లలు తెచ్చి అగ్ని చెయ్యండి. నేను అందులో ఆహుతి అవుతాను. ఆ తరువాత మీరు నన్ను హాయిగా భుజించండి," అన్నది కుందేలు.

మనిషివేషంలో వున్న చందమామ అక్కడే పుల్లలుపేర్చి పెద్ద మంట చేశాడు. కుందేలు ఒక్కసారి భగవంతుణ్ణి స్మరించి ఆ మంటలోకి దూకింది. కాని, చిత్రం! ఆ మంటలు కుందేలుకు సోకనేలేదు.

"అయ్యా, నన్నీమంటలు దహించ కుండా వున్నాయి. నేనేంచేసేది? మీ ఆకలి ఎట్లా తీర్చేది?" అని కుందేలు శోకించింది.

మరుక్షణమే మంటలు మాయ మయాయి. చందమామ దేదీప్యమానమైన తన నిజస్వరూపంలో ప్రత్యక్షమై, కుందే లును ఎత్తుకొని: "నీజన్మ ధన్యమైనది. నిన్ను నాతో శాశ్వతంగా ఉంచుకుంటాను. రా, పోదాం," అన్నాడు.

ఆ నాటినుంచీ కుందేలు చందమామ వెంటనే వుంటోంది.



# మాయా చక్రం (అట్టచివరి బొమ్మ) - 1

పూర్వం ఒకానొకప్పుడు, దేవతలకూ రాక్షసులకూ మధ్యని గొప్ప యుద్ధం జరిగింది. యుద్ధం జరుగుతూన్న సమయాన అకస్మికంగా ఒక చిత్రమైన చక్రం ఆకాశంలోనుంచి వచ్చి భూమిమీద పడింది. ఆ వెంటనే ఒక దేవత, ఒక రాక్షసీకూడా చక్రంతోపాటు భూలోకంలో పడ్డారు.

వాళ్లిద్దరూ, ఆ చక్రం 'నాదంటే నాది' అని పోరాడుకొంటూ ఆ దేశపు రాజువద్దకు పోయి విన్నవించారు. 'రాజా! ఇది నావద్దనుంచి దొంగిలించుకు పోబోతున్నదీ రాక్షసి' అని దేవత చెప్పింది. 'కాదు, కాదు, ఇది నాదే. నావద్దనుంచే ఈమె దొంగిలించబోతున్నది' అని రాక్షసి చెప్పింది.

రాజు ఆ చక్రాన్ని చేతులోకి తీసుకొని, అటు యిటు పరిశీలించి చూచాడు. పేరుకాని, ఆనవాలుగాని కనిపించలేదు. అందుచేత అది ఎవరిదైనదీ నిర్ధారణ చేయటానికి వీలులేకపోయింది.

అప్పుడు రాజు 'ఈ చక్రంలో మహిమ ఏమైనా ఉన్నదా?' అని వాళ్లను అడిగాడు. అందుకు ఇద్దరూ 'ఉంది, ఉంది' అని జవాబు చెప్పారు. అప్పుడు రాజు ముందుగా ఆ చక్రాన్ని రాక్షసి చేతికి ఇచ్చాడు.

రాక్షసి ఆ చక్రాన్ని చేతబట్టి, అనేకవిధాల అటుయిటు తిప్పిచూచింది. ఏమిచేసినా, ఎంతసేపు తాపత్రయపడినా ఏ మార్పూ లేదు, మహిమా కనబడ లేదు. అప్పుడు రాజు చక్రం తీసుకొని ఈసారి దేవతకు ఇచ్చాడు. దేవత దానిని భక్తితో కళ్లకు అద్దుకొని, రాజు అధిష్ఠించిన వెండిసింహాసనానికి తాకించే సరికల్లా అందరకూ ఆశ్చర్యం కొలిపేటట్టు అది బంగారు సింహాసనంగా మారి పోయింది! రాజు సంతోషించి, మాటప్రకారం ఆ మాయాచక్రాన్ని దేవతకే బహూకరించాడు.

ఇందుకు రాక్షసి మండిపోయింది. 'నా మాటకు ఎవరు ఎదురు చెబుతారో వాని తల గాడిదతల అగుగాక! వాడు నా తంగేడువనంలోని ఎర్ర కోటలో 'బానిసగా ఉండిపోవుగాక!' అని ఘోరంగా శపిస్తూ, తన మంత్ర దండంతో రాజును తాకి మాయమైంది.

వెంటనే రాజు తల గాడిద తలగా మారిపోయింది! ఇదిచూచి దర్బా రంతా గగ్గోలు బయిల్దేరింది!! అప్పుడు... —(ఇంకా ఉంది)

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1955 జనవరి సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ నవంబర్ 7-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## నవంబరు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : క్షేమంగా వెళ్లు | రెండవ ఫోటో : లాభంగా రండి

పంపినవారు : బి. టి. పద్మినిదేవి, తణుకు.

బహుమతిమొత్తం రు. 10/ ఈ నెలాఖరులోగా పంపబడుతుంది



# వార్తలు-విశేషాలు

గుంటూరుజిల్లాలోని నాగార్జునకొండ పురాతన బౌద్ధస్థలం. అక్కడ ప్రశస్తమైన శిల్పాలూ, శిధిలాలూ ఉన్నాయి. నందికొండ ప్రాజెక్టుకింద ఈ ప్రాంతం జలమయమైపోవచ్చు. అందుచేత ఇక్కడి శిల్పాలను అమరావతికి తెచ్చి అక్కడ ఒక ప్రత్యేక మ్యూజియంలో వాటిని భద్రంచెయ్యటానికి ప్రభుత్వం యత్నిస్తున్నది.

ఇచ్చట మరికొన్ని శిల్పాలు దొరకగలవనే నమ్మకంతో పురావస్తుశాఖవారు త్రవ్వకం పని ప్రారంభించారు. ఈ పనివల్ల ప్రాచీనాంధ్ర చరిత్రకు సంబంధించిన అమూల్యవస్తు సంపద లభించవచ్చు.

*　　*　　*　　*

దాదాపు 200 సంవత్సరాలనుంచి మనదేశంలోని కొన్ని ప్రాంతాలపై ఫ్రెంచివారు అధికారం చెలాయిస్తున్నారు. ఈ మధ్యనే బెంగాల్ రాష్ట్రంలోని చంద్రనగరం, హౌరాజిల్లాలో కలపబడింది. అక్టోబర్ 18 వ తేదీన ఫ్రెంచి ఇండియా ప్రజాప్రతినిధులు కిజూర్‌లో సమావేశమై పుదుచ్చేరీ, కారైక్కాల్, మహేలనుకూడా ఇండియాలో కలపడానికి నిర్ణయించారు. దీనితో మనదేశంలోని ఫ్రెంచి అధికారం అంతమవుతుంది.

*　　*　　*　　*

అక్టోబరు 7 న బొంబాయి నగరపు బాలబాలికలు 2 లక్షలమంది భారతప్రధాని నెహ్రూకు ఘనమైన స్వాగతం ఇచ్చారు. "చాచా నెహ్రూకీ జై !" అని హర్షనినాదాలు చేశారు. శివాజీ పార్కులో సభజరిగింది. ఒక తరుణంలో నెహ్రూ వేదికనుండి దిగి కోలాహలంచేస్తున్న పిల్లల మధ్యకు జొరపడ్డారు. ఒకగంటసేపు పిల్లలు నృత్యాలూ వ్యాయామాలూ, ఇతర ప్రదర్శనలూ చేశారు.



**అ**క్టోబరు 1 శుక్రవారంనాడు ఆంధ్రరాష్ట్ర దినం వైభవంగా జరిగింది. ఏడాదికిందట ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది.

*　　　*　　　*　　　*

**భా**రత ప్రధాని పండిట్ నెహ్రూ అక్టోబరు 15 న విమానంమీద బయలుదేరి, బర్మా, ఇండో చైనాలలో ఆగుతూ చైనాకు వెళ్ళారు. అక్టోబరు 19 న భారత ప్రధాని నెహ్రూకూ, చైనా ప్రధాని చౌఎన్‌లాయ్‌కి సంభాషణలు ప్రారంభమయాయి. తమ సమావేశం చరిత్రలో ఒక ప్రముఖ ఘట్టమని నెహ్రూ అన్నారు. ఈ సమావేశం ఆసియా చరిత్రనూ, ప్రపంచ చరిత్రనూ కూడా మార్చివేయగలదని అనేకదేశాల రాజకీయవేత్తలు అభిప్రాయపడుతున్నారు.

*　　　*　　　*　　　*

**అ**క్టోబరు 2 న భారతదేశమంతటా గాంధీజయంతి జరిగింది. 85 ఏళ్ళక్రితం మహాత్మాగాంధి పుట్టారు. గాంధీజయంతినాడు దేశంలో కొత్తగా 60 ప్రజాసంక్షేమ కేంద్రాలు ఏర్పరిచారు.

*　　　*　　　*　　　*

**ఆం**ధ్ర బాలానంద సంఘంవారి యాజమాన్యాన అక్టోబరు 3 నుండి కర్నూలులో ఆంధ్ర సమావేశాలు జరిగాయి. వీటి ప్రారంభోత్సవాన్ని ఉస్మానియాకాలేజి భవనంలో గవర్నరు త్రివేదిగారు జరిపారు. సమావేశానికి హాజరైన 1500 మంది పిల్లలలో ఆంధ్ర, బెంగుళూరు, హైదరాబాద్‌లనుండి వచ్చినవారనేకులున్నారు. గవర్నరుగారు ప్రారంభోత్సవం జరిపిన సమావేశానికి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు అధ్యక్షత వహించి, ప్రసంగంకూడా చేశారు. బాలకళలప్రదర్శనం జరిగింది. అక్టోబరు 4 న సమావేశాలు ముగిశాయి.

*　　　*　　　*　　　*

**ప్ర**తి ఏడూ ఉత్తమ బాల చిత్రానికి బహుమతి ఇవ్వటానికి భారతప్రభుత్వం నిశ్చయించింది. ఉత్తమ బాలచిత్రానికై భారత ప్రధానమంత్రి పదకంకూడా ఒకటి ఏర్పాటయింది. అయితే మంచి బాలచిత్రాలు లేనందున ఆ పదకాన్ని ఏ సినిమాచిత్రానికీ ఇవ్వలేదు.

ఉత్తమ బాలచిత్రాల నిర్మాణాన్ని ప్రోత్సహించటానికై భారతప్రభుత్వం ఢిల్లీలో ఒక సంఘాన్ని ఏర్పరచ నిశ్చయించింది. ఈ సంఘానికి దేశమంతటా శాఖలుంటాయి.



# చిత్రకథ



దాసూ, వాసూలు కలిసి రెండు పాత స్ప్రింగులు సంపాయించారు. వాటిని చెక్కల్లో బిగించి కాళ్ళకు కట్టుకొని దాసు పైకెగరసాగాడు. చూస్తూ నించున్న వాసు, "అలా కాదురా దాసూ! వాటితో పైకెగరటం బాగానేవుంది. ఇప్పుడు ముందుకు ఎంతదూరం దూకగలవో చూడు," అన్నాడు.




ఉత్సాహంకొొండికీ దాసు ముందుకు దూకాడు. ఆ దూకటంలో ఎదురుగా పళ్లగంప తెస్తున్నవాడితో ఢీకొట్టాడు. వాడు కిందపడి లేచేలోగా దాసూ, వాసూ అక్కడినించి పరిగెత్తసాగారు. దాసుకు మాత్రం పరిగెత్తేందుకు ఆ స్ప్రింగ్ బూట్లు సహాయపడలేదు సరికదా, ఆటంకంగాకూడా తయారయినై.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI CHAKRAPANI'





"చందమామ" గురించి ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేదు. అత్యంత రమణీయమైన ఆకృతితో, ఆబాలవృద్ధులూ ఆసక్తితో చదివే రచనలతో కూడిన ఈ "కుటుంబ పత్రిక"కు ఒక విశిష్టత ఉన్నది.

పిల్లలు కథలంటే చెవికోసుకుంటారు. కథలు చెప్పమని పెద్దవాళ్లను వేధిస్తారు. ధైర్యసాహసాలను చిత్రించే పాత కథలు వారికి రుచిస్తాయి. అటువంటి సాహిత్యాన్ని అందజేస్తూ, చదివేవారికి లాభాన్ని చేకూర్చే పత్రిక ఒకటి నడపాలన్న ఆలోచన దాదాపు రెండు దశాబ్దాల క్రితం తెనాలి వాస్తవ్యులైన శ్రీ చక్రపాణికి కలిగింది.


శ్రీ చక్రపాణి

అనాదిగా వస్తున్న కథలెన్నో ఉన్నాయి. వాటిలో చక్కని నీతి ఉంటుంది. ప్రాచీన సంస్కృతి సంప్రదాయాలుంటాయి. వాటిద్వారా పిల్లలు తమ సంస్కృతికి పునాది వేసుకుంటారు. ఇలాటి కథలు దేశమంతటా అసంఖ్యాకంగా ఉన్నై. వాటిని ప్రజలకు అందజేయాలని శ్రీ చక్రపాణి సంకల్పం.

అయితే ఈ సంకల్పాన్ని ఆయన వెంటనే ఆచరణలో పెట్టలేదు. ఎందుచేతనంటే ఉద్యమంలాటి ఈ పనిని ఉదాత్తంగానే సాగించాలిగాని, తొందరపడి ఏదోవిధంగా ఆచరణచేస్తే మొదట ఉద్యమానికే ముప్పు కలుగుతుంది. చవుకబారు అనుకరణలు బయులుదేరుతాయి. ఆశయం విఫలమవుతుంది. ఆశయం ఎంత ఉదాత్తమైనదో దాని ఆచరణకూడా







అంత ఉదాత్తంగా ఉండా లంటే, ఆ ఆశయాన్ని పూర్తిగా అర్థంచేసుకొని, తగినరీతిని ఆచరణలో పెట్టే శక్తిసామర్థ్యాలు గలవారి సహకారంకూడా ఉండాలి.

అందుచేత ఒక దశాబ్దంపాటు ఈ ఉద్యమం ఆశయంగానే ఉండిపోయింది. ఆ తరువాత తమ ఆశయాన్ని ఆచరణలో పెట్టగల వ్యక్తి శ్రీ బి. నాగిరెడ్డి, శ్రీ చక్రపాణికి తటస్థపడ్డారు. శ్రీ నాగిరెడ్డి ముచ్చటైన ముద్రణలోసిద్ధహస్తులు. మద్రాసులో ఆయన నడుపుతున్న బి.ఎస్.కె. ప్రెస్ కీర్తి ఆంధ్రదేశం అంతటా వ్యాపించింది.


శ్రీ నాగిరెడ్డి

తమ రచనలను బి. ఎ స్. కె. ప్రెస్‌లో ముద్రించుకొనటానికి వచ్చిన శ్రీ చక్రపాణి తమ ఆశయాన్ని శ్రీ నాగిరెడ్డికి తెలిపారు. వెంటనే శ్రీ నాగిరెడ్డి ఆ ఆశయానికి రూపకల్పన చేసే నిమిత్తమై బి. ఎస్. కె. ప్రెస్‌ను ఈ పత్రికా ప్రచురణకు అనుగుణంగా మార్చారు. "చందమామ"ను తెలుగు, తమిళ భాషలలో ప్రచురించటానికి ఒక నిర్దుష్టమైన దీర్ఘకాల ప్రణాళిక తయారయింది. ఈ ప్రణాళిక కాలక్రమాన భారతీయ పత్రికాప్రచురణ చరిత్రలో అపూర్వమైనదిగా పరిణమించింది.

1947 జూలైలో "చందమామ" ఆరంభింపబడినప్పటి నుంచీ అత్యంత విజయవంతంగా సాగింది. రెండవ సంచికే 20 వేల ప్రతులు వేయవలసి వచ్చింది. ఇతర భాషల వారు ఈ పత్రికను తమ భాషలలోకూడా వెలువరించమని ప్రోత్సహించసాగారు. పత్రికయొక్క విజయుంచాటున అనేక బాలారిష్టాలను తొలగించుకొంటూ శ్రీ నాగిరెడ్డి "చందమామ"ను కన్నడ, హిందీ, మరాఠీ, మళయాళ, గుజరాతీ







భాషలలోకూడా వెలువరించి,

రాజ్యాంగం గుర్తించే పదకొండు భాషలలోనూ ఏడింట "చందమామ"ను వెలయింపజేశారు. తమ భాషలలోకూడా "చందమామ"ను ప్రచురించమని సింధీ, బెంగాలీ సంఘాలు వ్రాసే లేఖలు కుప్పతెప్పలుగావస్తున్నవి. ఈ విజయానికి ప్రధాన కారణాలు నాగిరెడ్డి చక్రపాణి ద్వయం పత్రికా నిర్వహణలో చూపే నిష్ఠాశ్రద్ధలూ, వారికి తోడ్పడే నిర్వాహక బృందంయొక్క శ్రద్ధానక్తులూనూ. సహజంగా అగ్రస్థానంలో హిందీ "చందమామ" ఉన్నది. అది నెలనెలా 50 వేల కాపీలకుపైగా చెల్లుతుంది. తరువాత చెప్పుకోదగినవి తెలుగు, మరాఠీ ప్రచురణలు. ఇవి ఒక్కొక్కటీ 40 వేల కాపీలకు పైగా చెల్లుతున్నాయి. ఆదర్శాలకొరకు ప్రాకులాడటం వ్యయంతో కూడిన పని అని అందరికీ తెలిసిన విషయమే. అందులోనూ "చందమామ" నిర్దుష్టత్వంకోరే పత్రిక. అటువంటి సందర్భంలో పత్రికమీద వచ్చే నష్టాన్ని సాధ్యమైనంత తక్కువలో ఉంచి, ఆర్థికదృష్టివల్ల పత్రికయొక్క అభివృద్ధికి అంతరాయం కలగకుండా చూసుకోవటానికి శ్రీ నాగిరెడ్డి వ్యాపారదక్షత ఎంతయినా తోడ్పడుతోంది.



శ్రీ ప్రసాద్

"చందమామ" పూర్వం ఉండిన ఇరుకు సందులనుండి బయటపడి రమ్యమైన స్వంత భవనాలలో వచ్చి చేరింది. దాని నిర్వాహకులు నాగిరెడ్డి చక్రపాణి ద్వయంకూడా అదే ఆవరణలో చేరారు. ప్రెస్ కమిషన్ సభ్యులలో ఒకరు ఒక మిత్రునితో నుడివినట్టు ఈ పత్రిక, "పత్రికా పరిశ్రమ కొక అలంకరణ," ఆశయపూరితమైనది, ఆహ్లాదజనకమైనది ....

"కోట్లకు విలువైన పత్రిక"







శ్రీ రెడ్డి చక్రపాణిగార్లు ఇదే విధంగా చిత్ర పరిశ్రమలోకూడా తమ ప్రాభవం ప్రదర్శిస్తున్నారు. ఈనాడు వాహినీస్టూడియో చిత్రనిర్మాతలకు నందనోద్యానంలాటిదన్నా, సూయజ్‌కు తూర్పుగా ఇంత గొప్ప స్టూడియో లేదన్నా, దానికి కారణం వీరిరువురు తమ శక్తులను మేళవించి ఉత్సాహంతో క్రమవిధానాన్ని అనుసరించి కృషి చేయుటమే. సినిమా రంగంలో వాహినీ స్టూడియోలాగే పత్రికా ప్రపంచంలో "చందమామ" కూడా అనుపమమైనదిగా, ఆదర్శప్రాయమైనదిగా తరుచు ప్రశంసించబడుతున్నది.

ఇంతకన్న విశేషమేమంటే ఈ ఉద్యమంలోకి శ్రీ రెడ్డిగారి కుమారుడు ప్రసాద్, శ్రీ చక్రపాణిగారి కుమారుడు తిరుపతిరావు కూడా ప్రవేశించి, తమ తండ్రులు నెలకొల్పిన సత్సంప్రదాయాలను బలపరుస్తూ, వాటిని ఇంకా ముందుకు తీసుకొనిపోవటానికి తగిన కృషిచేస్తున్నారు. "చందమామ" నిర్వహణలో వీరు బాధ్యతగల పాత్రలు విజయవంతంగా నిర్వహిస్తున్నారు.


శ్రీ తిరుపతిరావు

వీరి నిర్వహణక్రింద పనిచేసే ప్రోసెస్‌శాఖ "చందమామ" కు సంబంధించిన పని మాత్రమేకాక, దానికి అనేకరెట్లు భారమైనపని చేస్తూ, కొద్దికాలంలోనే గొప్ప కీర్తి ప్రతిష్ఠలను సంపాదించుకొని, ఈ యువకుల సమర్థతకు ప్రత్యక్ష నిదర్శనంగా ఉన్నది. ముందు ముందు ఈయువకులు 'చందమామ' బాధ్యతలను పూర్తిగావహించి దానిని ఇంకా విశిష్టంగా, ఆదర్శవంతంగా, దేశానికి ప్రయోజనకారిగా చేయగలుగుతారనటానికి సందేహంలేదు.




"చందమామ" మీకు సుపరిచితమే. అది ప్రతి పత్రికల అంగడిలోనూ కనిపిస్తుంది, ఎవరింటికి పోయినా అక్కడ సాక్షాత్కరిస్తుంది. దానిలోని అందమైన కూర్పూ, ఆహ్లాదజనకమైన రచనలూ మనసును ఇట్టేపట్టేస్తాయి.



కాని దాని ఉత్పత్తి పరిణామాలు మీరెరగకపోవచ్చు. కనుక లోనికి దయచేసి, దీనిగాథ వినండి :—లోపలికి అడుగు పెట్టగానే మూడువైపుల చక్కని కట్టడాలూ, అందులో ఒకవైపున పెద్ద హర్మ్యాలూ కనిపిస్తాయి.

1. ఈ భవనంలో చిత్రకారులు "చందమామ"కు అలంకరణప్రాయమైన చిత్రాలనూ, వర్ణచిత్రాలనూ తయారు చేస్తారు. "చందమామ"ను వివిధభాషలలో దేశం నలుమూలలకూ అందజేసే శాఖలుకూడా ఇందులోనే ఉన్నై.





1

2



3

4





2. బహుభాషలలో "చందమామ"ను సృష్టించిన శ్రీ నాగిరెడ్డి, శ్రీ చక్రపాణిగార్లు ఈ భవనంలో ఉంటారు. 3. ఈ భవనంలో సంపాదకవర్గం కూర్చునే గదులూ, అచ్చాఫీసూ ఉన్నాయి. 4. "చందమామ"లో కనిపించే అందమైన బొమ్మలన్నీ నిర్దుష్టంగా ఇక్కడే ప్రాసెస్ అయి, తరువాత వింతవింత రంగులలో "చందమామ"లో ఎక్కుతాయి.



పత్రికాఫీసులలో జరిగే కర్మకాండ ఇక్కడకూడా జరిగినప్పటికీ, చందమామ ఆవరణ శుభ్రంగా అద్దంలాగ ఉంటుంది. దీనికి సంబంధించిన అన్ని శాఖలూ యంత్రాలలాగ పనిచేస్తాయి. ఇందులో పని చేసేవారందరూ 'చందమామ' ఆదర్శాలను శిరసావహిస్తారు.



వీరే "చందమామ" సంపాదకవర్గం. అందరికీ అర్థమయే సులభ శైలిలో, ప్రాచీన సంస్కృతిని ప్రతిబింబించే నీతికథలను వీరు "చందమామ" పాఠకుల కొరకు తీర్చిదిద్దుతారు.



"చందమామ" చిత్రకారులు. సంపాదకవర్గం ఏరిన కథలకు వీరు బొమ్మలు తయారుచేసి కథలకు అలంకరణ చేకూర్చుతారు. మీకు ఆనందం



కూర్పే అట్టమీది బొమ్మలూ, అట్టచివరి బొమ్మలూ, ఇతర రంగు చిత్రాలూ వీరి కుంచెలనుంచే వెలువడుతాయి.



చిత్రకారులు తయారు చేసిన బొమ్మలను ప్రోసెసింగ్ శాఖకు చెందిన ప్రవీణులైన పనివారు బ్లాకులుగా తయారుచేస్తారు.

"చందమామ" అచ్చాఫీసుకు సంబంధించిన కొన్ని శాఖలను ఇక్కడ చూడవచ్చు. ఈ కార్ఖానాలో మరమ్మతులు వగైరాలు జరుగుతాయి.





ఏడు భాషలలో "చందమామ"కు అచ్చులకూర్పు చేసే కంపోజిటర్లు.



ముఖచిత్రాలను ముద్రించే ఆటోమాటిక్ అచ్చు యంత్రాలు

"చందమామ"ను ముద్రించటానికి అధునిక ముద్రణ యంత్రాలు అనేకం అవసరం. ఇవే ఆ యంత్రాలు.





వీటిమీద "చందమామ" ఏడు భాషలలో, పంచ రంగులలో ముచ్చటగా అచ్చవుతుంది.



అచ్చయి వచ్చిన "చందమామ" ఫారములను ఈ కుర్ర వాళ్ళు మడుస్తారు.



తరువాత మడిచిన ఫారములను యంత్ర సహాయంతో కుట్టుతారు.



అనంతరం కటింగ్ చేసి కట్టలు కడతారు.



ఏ ఊరికెన్ని కాపీలు వెళ్లాలో ఆప్రకారం పార్సెల్స్ కట్టి వాటిపై ఏజెన్సీల చిరునామా వగైరా వివరాలు లిఖిస్తారు. ఈవిధంగా కట్టిన పార్సెల్స్ వేలసంఖ్యలో వాన్‌లో రైలుస్టేషన్‌లకూ, పోస్టాఫీసుకూ, ఎయిరోడ్రోమ్‌కూ చేర్చబడి అక్కడినుండి వందలూ, వేలూ మైళ్లు ప్రయాణంచేసి దేశమంతటా గల రెండు లక్షల గృహాలలో 'చందమామ'ను అందజేస్తాయి.





“ చందమామ ” వ్యాపారానికి సంబంధించిన జమాఖర్చులూ, దాదాపు మూడువేల ఏజెన్సీలూ,





వాటికి సంబంధించిన లెక్కలూ చూడటానికి విస్తృతమైన ఏర్పాట్లు అవసరం.

ఈ ఏర్పాట్లకు సంబంధించిన వివరాలను ఇక్కడ చూడవచ్చు.





"చందమామ" తో పరిచయం చేసుకొనటానికి ప్రముఖ దేశ నాయకులు సయితం రావటంలో వింత లేదు. ఇలావచ్చిన వారిలో కేంద్ర



ఆర్థిక మంత్రి శ్రీ దేశముఖ్, ఆయన సతీమణి శ్రీమతి దుర్గాబాయి దేశముఖ్ కూడా ఉన్నారు. వారు ప్రోసెస్‌కు వచ్చి అక్కడ జరిగే పనిని కూడా ఆసక్తితో గమనించారు.



ఇలావచ్చి "చందమామ"ను చూసి ఆనందించిన ప్రెస్ కమిషన్ సభ్యులు "చందమామ పత్రికా పరిశ్రమ కొక అలంకారం" అని ప్రశంసించారు.

# ప్రియ పాఠకులకు
# సమర్పణ



తమ పిల్లలను ఉత్తమ భావి పౌరులుగా తయారు చేసుకొనటంలో పెద్దలకు అనుకూలమైన సాహిత్య సాధనంగా ఉండాలనే ఆశయంతో మేము "చందమామ"ను తీర్చి దిద్దాము. పెద్దలకు విశ్వాసపాత్రమూ, పిన్నలకు ఆకర్షవంతముగా ఉండి, ప్రతి కుటుంబానికీ సేవ చేయగలిగివుండేలాగు "చందమామ"ను తయారుచేయటంలో అత్యంత శ్రద్ధ వహించాము. ఏ ఒక్క కుటుంబానికి "చందమామ" వల్ల ఇలాటి సేవ జరిగినప్పటికీ ప్రకాశకులు తమ ఆశయం ఫలించినట్టు భావిస్తారు.



Photo by B. Bhansali



బహుమతి
పొందిన వ్యాఖ్య

లాభంగా రండి

పంపినవారు:
బి. టి. పద్మినిదేవి, తణుకు

